# ఆంధ్రపత్రిక



3178 82


The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 223 WEDNESDAY 16th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# అంబాలా జైలులో నాథూరాం గాడ్సే, ఆప్టేల ఉరి

## "ప్రపంచంలో ఎక్కడ చూచినా ప్రజలు శాంతికోసమే పరితపిస్తున్నారు"

### గాంధి ప్రబోధాల పై భక్తిశ్రద్ధలు ఎక్కువవుతున్నవని నెహ్రూ వివరణ

### బొంబై బహిరంగసభలో భారతప్రధాని ప్రసంగం

బొంబాయి, నవంబరు 14: పండిత నెహ్రూ ఈ వేళ ఇక్కడ ఒక బ్రహ్మాండమైన సభలో ప్రసంగిస్తూ పాశ్చాత్యదేశాలలో తమకు కలిగిన పర్యటనానుభవాలు వివరించారు. ఆయన తమ అనుభవాలను గూర్చి ప్రసంగిస్తూ, ప్రపంచంలో పెద్దపెద్ద దేశాలన్నీ మహాత్మాగాంధీ శాంతి సహకార ప్రేమ సందేశాలు, అవగాహన చేసుకోవడానికి తహతహపడుతున్నవనీ, ప్రపంచంలో సర్వత్ర శాంతికోసం పరితపిస్తున్నారనీ అన్నారు.

పండిత నెహ్రూ శివాజీపార్కులో 4 లక్షల జనాభా ఉన్న బ్రహ్మాండమైన సభలో ప్రసంగించారు. ఈ సమావేశం పండిత నెహ్రూ షష్టిపూర్తి మహోత్సవ సందర్భంలో ఆయన్ని అభినందించడానికై ఏర్పాటు చేయబడింది.

ఈ వేళ జనప్రవాహం అంతా శివాజీ పార్కు పైపుకే ప్రవహించింది. పండిత నెహ్రూను చూడగానే ప్రజా సముద్రం జయజయధ్వానాలు చేసింది. పండిత నెహ్రూ ఇందిరాగాంధీతోను, బొంబాయి గవర్నరు సర్ మహారాజసింగ్ తోను వేదికమీదకి రాగానే, ఆయనను చూడడానికి తహతహపడే జనసమూహాన్ని అదుపులో పెట్టడం చాలా కష్టమైనది. పోలీసులు అతికష్టంమీద జనాన్ని అదుపులో పెట్టకలిగారు. పండిత నెహ్రూ ముకుళిత హస్తాలతో ప్రజానీకం అభినందనాలు స్వీకరించారు.

వేదికమీద ఆర్. ఆర్. దివాకర్, బొంబాయి మంత్రులు, నెహ్రూ జన్మదినోత్సవ సంఘసభ్యులు, జోషిప్ ఆర్వా మొదలైన ప్రముఖులు ఉన్నారు. జనగణమన గానంతో సభాకార్యక్రమం ప్రారంభించింది. పండిత నెహ్రూ 40 నిమిషాల పాటు తమ పర్యటనానుభవాల పై ప్రసంగించారు. ఆయన పాశ్చాత్య దేశాల్లో అంతర్జాతీయ సమస్యా పరిష్కారం కోసం భారతి దేశసహాయం అపేక్షిస్తున్నారనీ, అమెరికా అర్థికంగాను రాజకీయంగాను, పారిశ్రామికంగాను చాల గొప్ప దేశమనీ, అయితే అది నూతన ప్రపంచానికి సంబంధించినదనీ అన్నారు. అయితే ఇండియా ఘనకాల గొప్ప సంస్కృతి ఉన్నదనీ, ఇది అతిప్రాచీనమైన దేశమనీ, ప్రధానమైన మానవసమస్యల పరిష్కారానికి ఈ దేశం ఎక్కువగా తోడ్పడిన దనీ అన్నారు. అమెరికాలో తనకు జరిగిన గౌరవం భారత దేశానికి జరిగిన గౌరవంగానే భావించాలని ఆయన అన్నారు.

ఆయన ఇంకా ఇల్లాగ అన్నారు. "నేను భారతదేశప్రతినిధిగానే పాశ్చాత్య దేశాలకు వెళ్లాను. ఆ దేశాలవారు మనదేశం పైపు ఎంతో ఆత్రంతో నిరీక్షిస్తున్నారు. భారతదేశం ప్రపంచానికి మార్గదర్శకం కాగలదని వారిఆశ.

అయితే మనకు బ్రహ్మాండమైన నావికా బలంగాని, విమానబలంగాని లేవు. మన సైన్యం కూడా చిన్నదే అయినా పైవారు మనపై ఇంత ఆసక్తి చూపించడానికి కారణం ఏమిటి? బహుశః మనదేశం పది ఏళ్ళలో సంపదలతో తుల తూగగలదనీ, భూగర్భంలో ఇన్నాళ్లనించీ సుప్తమై పోయిన సంపద పైకి రాగలదనీ వారు భావించి ఉండవచ్చును. లేకపోతే ఇండియా

(5-వ పేజీ తరువాయి)

### పండిట్ నెహ్రూ ఢిల్లీ ఆగమనం
### సర్దార్ పటేల్ ప్రభృతుల స్వాగతము

ఢిల్లీ, నవంబర్ 15: ఆరువారాల పాటు అమెరికా, కెనడా, ఇంగ్లండు దేశాలలో జగజ్జేగీయమానంగా పర్యటనచేసి తిరిగివచ్చిన భారతప్రధాని పండిట్ జవహర్లాలు నెహ్రూగారు నేడు మధ్యాహ్నము 12-25 గంటలకు ఢిల్లీవద్దనున్న పలాం విమానాశ్రయంలో మందహాసవదనారవిందులై విమానమునుదిగిరి. గవర్నరు జనరలు సి. రాజగోపాలాచారిగారును సర్దారు పటేల్ గారు ఇతర కేంద్రప్రభుత్వమంత్రులును రాజ్యాంగపరిషత్తు సభ్యులును విదేశాలరాయబారులును, భారత సర్వసేనాధిపతి కె. యం. కరియప్పగారును, సైనికాధికారులును కాంగ్రెసు ప్రెసిడెంటున్ను అ. భా. కాంగ్రెసు కమిటీసభ్యులును ఢిల్లీ రాష్ట్రకాంగ్రెసు కమిటీ సభ్యులును ప్రభుత్వకార్యదర్శులును హాజరై నెహ్రూగారికి స్వాగతమిచ్చిరి.

## 'హేగ్ నిర్ణయాలు అన్ని వర్గాలకు తృప్తికరంగా ఉండగలవు'
—డాక్టర్ హట్టా

### బటేవియాకు ఇండొనీషియా ప్రధాని రాక: వెంటనే జోగ్జకర్తాకు ప్రయాణం

బటేవియా, నవంబర్ 14: "హేగ్ సభనిర్ణయాలు ఇండొనీషియాలోని అన్ని రాజకీయపక్షాలకు అంగీకారయోగ్యంగా వుండగలవని భావిస్తున్నాను." అని డా॥ మహమ్మద్ హట్టా నేడు ప్రకటించారు. ఆయన ఇవ్వాళనే ఇండొనీషియాకు తిరిగివచ్చారు.

న్యూగినీ విషయంలోగూడా త్వరలోనే సరియైనపరిష్కారం కుదురుతుందని డా॥ హట్టా ఆశిస్తున్నారు.

డా॥ హట్టా ఆయన భార్యతోగూడా నేటి విమానంలో ఇక్కటకువచ్చి, కొద్దిసేపు ఆగి సరాసరి జోగ్జకర్తాకు ప్రయాణమై వెళ్లారు.

కమాండురాన్ విమానాశ్రయంలో దిగినప్పుడు ఆయనకు జోగ్జకర్తాసుల్తాన్, డచ్చి గవర్నర్ జనరల్ మంత్రివర్గం డైరెక్టరు డా॥ కాయట్స్ సమితితాలూకు ఇండొనీషియా సంఘసభ్యులు ఇండియన్ కాన్సల్ శ్రీ కె. వి. కన్నంపిళ్లై ప్రభృతులు ఆయనకు స్వాగతం ఇచ్చారు.

డా॥ హట్టాను చూడడానికి దాదాపు 5 వేలమంది ప్రజలు విమానాశ్రయందగ్గర చేరారు. ఆయన్ను చూడాలని, ఆయన మాట్లాడగా వినాలనే కుతూహలంతో వారు రెండుసార్లు డచ్చిపోలీసు రక్షణశ్రేణినికూడా ఛేదించుకుపోయారు. డా॥ హట్టా వారిని ఉద్దేశించి మాట్లాడినతరువాతగాని వారు ఉపశమించలేదు.

4 సంవత్సరాల తరువాత తిరిగి ఈరోజున ఈ విమానాశ్రయంలో ఇండొనీషియన్ పతాకం కనిపించింది. ఎరుపు తెలుపు కలగలుపుగావున్న ఉడుపులు ధరించి అనేకమంది స్త్రీలు హట్టాను పలకరించడానికి విమానాశ్రయానికివచ్చారు. డా॥ హట్టా విమానంలోంచి దిగుతూవున్న సమయంలో వారు ఇండొనీషియన్ జాతీయగీతాన్ని మధురంగా ఆలపించారు.

డాక్టర్ హట్టా

## గాంధి హత్యా కేసు అధ్యాయం సమాప్తి

### కారాగార ఆవరణంలోనే ఇద్దరిశవాలకు అంత్యక్రియలు

### బంధువుల విజ్ఞప్తికి అధికార్ల నిరాకరణ

### ఉరికంబ మెక్కుతూ "అఖండ భారత అమరరహే" అని నినాదం

అంబాలా, నవంబరు 15: గాంధీ హత్యాకేసులో ఉరిశిక్ష విధింపబడిన నాథూరాం గాడ్సేయును, నారాయణ ఆప్టేయును తూర్పు పంజాబు రాష్ట్రములోని అంబాలా సెంట్రలుజైలులో నేడుదయము 8 గంటలకు ఉరితీయబడిరి. ఉరిశిక్ష అమలు జరుపుటకు హాజరైన అధికారులు జెయిలు ఆవరణలోనుండి ఉదయము 8 గం॥ 6 ని॥ లకు వెలుపలకు వచ్చిరి.

గాడ్సే సోదరుడున్ను ఆప్టే సోదరుడున్ను ఆ శవములకు అంత్యసంస్కారములను తామే జరిపెదమనిన్నీ తమకు ఆ శవములను ఒప్పజెప్పవలసినదనియు తంతివార్తద్వారా పిటీషను పంపుకొనియుండిరి. శవములను ఒప్పగించుటకు వీలులేదని ఇదివరలో ఇండియా గవర్నమెంటుచేసిన నిర్ణయమును తిరిగి మార్పుచేయుటకు వీలు లేదని గాడ్సే బంధువులకు ఆప్టే బంధువులకు ఇండియా గవర్నమెంటు తెలియజేసిరి. కనుక, ఆ రెండు శవములకు అంత్యసంస్కారమును జెయిలు అధికారులే జరుపుచున్నారు.

ఉరి స్తంభంమీదకు ఎక్కించి ఉచ్చు బిగించిన తక్షణం గాడ్సే మరణించెను. కాని ఆప్టేకు ఉరి స్తంభంమీద ఉచ్చు బిగించినప్పుడు ప్రాణం పోవుటకు రెండు నిమిషములు పట్టెను.

వారిని ఉరితీయుటకు 5 నిమిషములు ముందుగా వారిని వారి జెయిలు గదులలో నుండి బయటకు తీసికొనివచ్చిరి.

వారిద్దరికిని అంబాలా జెయిలులో ఉండగా జెయిలు అధికారులు వారికి తృప్తికరముగా సౌకర్యములను కలుగజేసిరని వారిద్దరును ఉరితీయబడుటకు పూర్వం చెప్పిరని తెలియుచున్నది.

వారు ఉరి స్తంభములమీద కెక్కునప్పుడు "అఖండ భారత అమరరహే" - "వందేమాతరం" అని ఉగ్రరంగా కేకలు వేసిరని తెలియుచున్నది. వారు ఉరి స్తంభముల వద్దకు నడచివెళ్లుటకు మూడునిమిషములు పట్టెను. వారిద్దరిని ఉరితీసిన పిమ్మట వారు విగత జీవులైనప్పటికి జెయిలు రూల్సు ప్రకారంగా ఆ రెండు మృతశరీరములను 30 నిమిషములసేపు వ్రేలాడుచు ఉరి స్తంభముల మీదనే ఉంచబడెను.

జెయిలు ఎదుటగాని, చుట్టుప్రక్కలగాని అంబాలా నగరములోగాని, అంబాలా కాంటోన్మెంటులోగాని ఏవిధమైన జనసమూహ సమావేశములు ఆర్భాట ప్రదర్శనములు ఏదిన్ని జరుగలేదు.

తమ అస్థికలను సింధునదిలో కలుపవలసినదిగా నాథూరాం గాడ్సేయున్ను, నారాయణ ఆప్టేయున్ను తమ కోరికను వెల్లడించినట్లుగా వారిద్దరి చిట్టచివరి పర్యాయము సందర్శించియుండిన వారి బంధువులు చెప్పుచున్నారు. బంధువులు సుమారు 4 గంటలసేపు జెయిలులో సందర్శించి మాట్లాడిరి.

సుమారు 30 మంది బంధువులు నిన్నటిదినము గాడ్సేనున్ను, ఆప్టేనున్ను జెయిలులో సందర్శించి మాట్లాడిరి. వచ్చిన వారిలో ఆప్టేభార్య, ఆప్టేయొక్క ఇద్దరు సోదరులు గాడ్సేయొక్క ఇద్దరు సోదరులు అతని తాలూకు తోబుట్టువులకలరు.

ఉరిశిక్ష విధింపబడిన యిద్దరికి పౌరలి నిచ్చుటకు తనకు అనుమతి నీయవలసినదని గాడ్సే తోబుట్టువు అంతకు పూర్వమే జెయిలు అధికారులను కోరెను. కాని అందుకు అనుమతి యివ్వబడలేదు.

గాడ్సే తల్లిదండ్రులు గాడ్సేకు తంతి వార్తను పంపిరి. "నీకు మా ఆశీర్వచనములు నీకు భగవంతుడు ధైర్యమొసంగుగాక" అని ఆ తంతివార్తలో కలదు.

నాథూరాంగాడ్సే శవమునకు అంత్యక్రియలను జరుపుటకై గోపాల గాడ్సేను పెరోలుమీద అంబాలా సెంట్రలు జెయిలునుండి తాత్కాలికావకాశము నివ్వవలసినదిగా నాథూరాం గాడ్సేయొక్క మరొక సోదరుడను దత్తాత్రేయ గాడ్సే ఇండియా ప్రభుత్వ హోంశాఖా మంత్రికి పిటీషను తంతివార్తద్వారా పంపెను. కాని ఇండియా గవర్నమెంటువారు గోపాల గాడ్సేను పెరోలుమీద విడుదల చేయుటకు నిరాకరించిరి. గోపాలగాడ్సే ప్రస్తుతము అంబాలా జెయిలులోనే యావజ్జీవ ఖైదు శిక్షననుభవించుచున్నాడు.

వారిద్దరిని ఉరితీయుటకు ముందు వారి ఫోటోలు తీయుటకు అనుమతి నొసంగవలసినదని గాడ్సే బంధువులును ఆప్టే బంధువులును కోరిరి. కాని, వారికోరికను ఇండియా ప్రభుత్వం హోంశాఖామంత్రి

(8-వ పేజీ చూడుడు)

## రాష్ట్రముల నమూనా రాజ్యాంగాన్ని తాత్కాలికంగా హైద్రాబాద్‌కు వర్తింప చేస్తూ త్వరలో నిజాంనవాబు ప్రకటన

ధాంగ్రధా, నవంబరు 14: భారత రాజ్యాంగ పరిషత్తువారు ఆమోదించినరాష్ట్రముల నమూనా రాజ్యాంగమును హైద్రాబాదు సంస్థానానికి కూడా వర్తింపచేయుటకు తాత్కాలికంగా అంగీకరించినట్లుగా నిజాం నవాబు త్వరలోనే ఒకప్రకటన జారీ చేయునని భారతప్రభుత్వ సంస్థానశాఖ రాజకీయ సలహాదారు వి. పి. మీనన్ గారు నేటిసాయంకాలం యిక్కడ పత్రికా ప్రతినిధులలో ప్రసంగిస్తూ అన్నారు. నవాబు తాత్కాలిక ఆమోదమును తర్వాత హైద్రాబాద్ రాజ్యాంగపరిషత్తు స్థిరీకరింప వలసియున్నది. హైద్రాబాదు రాజ్యాంగ పరిషత్తుకు 1950 మార్చిలో ఎన్నికలు జరుగనున్నది. ఈ సంవత్సరాంతానికి హైద్రాబాదులో మిలిటరీ గవర్నరు స్థానే ఒక సివిల్ అధికారిని నియమించటం జరుగగలదనీ, అయితే యీ పదవికి ఎవరిని నియమించాలీ అన్న విషయం పై యింకా నిర్ణయం జరుగలేదనీ కూడ మీనన్‌గారు అన్నారు.

## "స్థిర వైఖరితో ఇక విస్పష్ట విధానాన్నే అనుసరించాలి"

### దేశ ఆర్థిక దుస్థితి నివారణకు ప్రజల సహకారం: పటేల్ ఉద్బోధ

న్యూఢిల్లీ, నవంబరు 14: భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేలు న్యూఢిల్లీ రేడియోలో నేటిరాత్రి ఉపన్యసిస్తూ, దేశాన్ని ఎదుర్కొంటున్న ఆర్థిక దుస్థితియొక్క తీవ్రతను కళ్లకు కట్టేట్లుగా వర్ణించిచెప్పి ఈ కష్టాలనుండి దేశాన్ని గట్టెక్కించడానికి ప్రజలందరూ చేయూత ఇవ్వాలని విజ్ఞప్తిచేసెను. "కాగితాల మీద పథకాలు ప్రణాళికలు తయారుచేస్తూ కాలక్షేపం చేయడానికి ఇది తరుణంకాదు. దృఢసంకల్పంతో నిర్ణీతవిధానకార్యాచరణకు పూనుకోవలసిన సమయం వచ్చింది" అని సర్దార్ పటేల్ నొక్కిచెప్పెను.

సర్దార్ పటేలు ఇట్లు ఉపన్యసించెను: "మిత్రులారా, నా ప్రియ సోదరుడైన జవహర్లాల్ జన్మదినోత్సవంనాడు, నేను ఈ ఉపన్యాసం చేయగలగడం నాకు చాలా సంతోషజనకంగా ఉన్నది. ఇది జవహర్లాల్ నెహ్రూ జన్మదినం అవడం వల్లనేగాక, అమెరికాలో తన దైత్రయాత్రను జయప్రదంగా ముగించుకొని స్వదేశానికి ఆయన తిరిగివస్తున్నరోజు అవడంవల్లకూడా ఈరోజు ద్విగుణంగా పవిత్రమై యావద్భారతజాతికి పర్వదినమైంది. యావత్తు హృదయంతోను మనఃపూర్తిగా మన ప్రియనాయకునికి మనం స్వాగతమిస్తున్నాము. మన అచంచలమైన విశ్వాసము భక్తి తాత్పర్యాలే ఈ పుట్టినరోజు పండుగనాడు మనము ఆయనకు అర్పించెడి కానుకలు. ఈ కానుకల విలువను ఆయన ఎప్పుడో వడ్డీతోసహా తీర్చివేసెను. విదేశాలలో మన దేశముయొక్క పరువుప్రతిష్టలను, మనయెడ ప్రపంచానికి ఉన్న ప్రేమసౌహార్ద్రాలను శతగుణంగా అభివృద్ధిజేసి పండిట్ నెహ్రూ తిరిగివస్తున్నారు. ఆయనకు మనం ప్రేమపూర్వకంగా దీవనలతోను అభినందనలతోను స్వాగతమిస్తుముగాక. స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాత, పండిట్ నెహ్రూ ఎంత గురుతరమైన కార్యభారాన్ని వహించవలసియున్నదీ, శనివారంనాడు ఆర్థిక పరిస్థితి గురించి నేనుచేసిన ఉపన్యాసాన్ని బట్టి మీకు కొంత అర్థమైఉంటుంది. దేశాన్ని ఎదుర్కొంటున్న కష్టపరంపరను, ఈకష్టపరంపరయొక్క బృహత్పరిమాణాన్ని మీకు ఇప్పుడు తిరిగి విడమర్చిచెప్పి, వీటిని తరించడానికి సాధనోపాయము లేమిటో వివరించగోరుతున్నాను. కాగితాలమీద పథకాలూ ప్రణాళికలూ తయారుచేస్తూ కాలక్షేపం చేయడానికి ఇది తరుణంకాదని నిర్మొహమాటంగా కట్టెవిరిచి చెప్పగోరుతున్నాను. స్వప్నలోకంలో నందనవనాలను సృజిస్తూ, ఆకాశంలో సౌధాలను నిర్మిస్తూ వినోదించతగినసమయం గడిచిపోయింది.

వాస్తవ ప్రపంచంలోని స్థితిగతులను గమనించి, ఏతదనుగుణంగా మన మనోవాక్కాయములను ప్రవర్తింప జేయవలసిన తరుణంవచ్చింది. నిక్కచ్చిగా, అసందిగ్ధమైన విధానాలను మనసులోపెట్టుకొని వాటినిపట్టి నడవడం ప్రారంభించాలి. తిండి బట్ట ఇవిరెండూ మన ప్రాథమికావసరములనీ, వీటిని తీర్చడమే మన పరమ ప్రధానమైన కర్తవ్యమనీ, గడచిన 3 సంవత్సరములుగా నేను పదే పదే నొక్కి చెబుతూవచ్చాను.

అధికాహారోత్పత్తి పథకముల కింద కోట్లకొలదిగాడబ్బు మనం వమ్ముచేశాము; విదేశములనుండి ఆహారధాన్యాల దిగుమతుల కింద అపారంగా ధనం వ్యయంచేస్తున్నాము. వీటన్నిటి ఫలితంగా మన విదేశీ కరెన్సీనిల్వలు ఇంచుమించు అడుగంటినవి. వీటన్నిటికితోడు పంచదార కరువుకూడా ఒకటిచ్చిపడ్డది. అధిక లాభాలకోసం ఆశపడి ఈకరువును కావాలని సృష్టించిన ఈ వ్యాపారస్థులను ఏమనాలో నాకు బోధపడడంలేదు. మళ్ళీ చెరుకు మిల్లులు పని చేసేకాలంవచ్చి కొత్త పంచదార వచ్చే వరకు ఈ కరువు తీరదుండని తోచదు. అయితే అదృష్టవశాత్తు ఆ మహాకాలం దగ్గరలోనే ఉన్నది. అంతవరకు ఎలాగో ఓపిక పట్టవలసిందని ప్రజలకు మనవిచేస్తున్నాను. తిండి కొరతను తీర్చడానికి మనం ముఖ్యంగా కృషి చేయాలి. ఎకరానికి పంటను వృద్ధిచేయడము ఒకటి, బంజరు భూములను సాగుకిందకు తెచ్చి వ్యవసాయ భూములమేరను పెంచడం రెండు. మనం తీవ్రంగా కృషి చేసినట్లయితే, ఈ తిండి కొరతను తేలిగ్గా తీర్చగలమని నాగాఢ విశ్వాసం. మనం ఆహార స్వయం సమృద్ధిని 3 ఏళ్ళకిందటనే సాధించి ఉంటే, ఆహారధాన్యాల దిగుమతులకింద ఇంతధనం వ్యయపెట్టవలసిన అవసరం కల్గేదికాదు; ఆ డబ్బుతో పాకిస్తాన్‌నుండి వచ్చిన కాందిశీకులందరికీ పునరావాసం

( 5వ పేజీచూడుడు)

# దెందులూరు ఫిర్కా అభివృద్ధి సంఘం

## ఫిర్కాలో బుల్‌డోజర్ యంత్రం ప్రవేశపెట్టాలని కోరిక

ఏలూరు, నవంబరు 13: దెందులూరు ఫిర్కా అభివృద్ధి సంఘం నేటి సాయంత్రం కొవ్వలిలో జిల్లా కలెక్టరు షేక్ అహ్మద్ గారి అధ్యక్షతను సమావేశమై ఫిర్కాలో 'బుల్‌డోజర్' యంత్రమును వ్యవసాయమునకు తెప్పింపవలెనని కోరింది.

కొవ్వలిలో శిశురక్షణ, ప్రసూతి వైద్య కేంద్రము నొకదానిని నెలకొల్పవలెనని, గోపన్నపాలెంలో ఇటీవలి తుపానులో స్కూలు షెడ్డు ఎగిరిపోయినందున కొవ్వలిలో ఎమ్. బి. షెడ్డు నొకదానిని నెలకొల్పవలెనని, ఆరోగ్యశాఖాధికారులను కోరుటకు కూడా సమావేశం తీర్మానించింది. ఫిర్కాలో బహుముఖంగా పనిచేసే సహకార సంఘములకు ఫిర్కాలో ఆహార ధాన్యములను సేకరించుటకు, పంపకం చేయుటకు అధికారము ఇవ్వవలెనని మరొక తీర్మానంలో ప్రభుత్వమును కోరింది.

పి. డబ్ల్యు. డి. వారు నిర్లక్ష్యం చేసినందున, సారవంతమైనప్పటికీ బీడుగా వదలివేయబడిన కొవ్వలిలోని 650 ఎకరాల భూమిని కలెక్టరుగారు పరిశీలించి దానివిషయమై సంఘమునకు తెలియపరిచారు. ప్రభుత్వమునకు పన్నులు చెల్లించటానికి తగినంత రివిన్యూ రాజేమోనని రైతులు భూమిని వదలివేశారనీ, కాని మురుగుబోదెకు అవలనున్న భూమి ఎకరం 2 వేల రూ॥ అమ్ముతున్నదని, ఈ బీడు భూమి ఉపయోగానికి తేవటాన్ని గూర్చి తాను చేయగలిగినదంతా చేస్తాననీ కలెక్టరుగారుగారు చెప్పారు. (స్వ. వి.)

# బళ్ళారి జిల్లా బోర్డు ఉపాధ్యక్షత

## రంగనగౌడ్‌గారి ఎన్నిక

శ్రీ బళ్ళారి, నవంబరు 14: బళ్ళారిజిల్లా బోర్డు ఉపాధ్యక్షత పదవికి శ్రీ బడెనిహాల్ రంగనగౌడ్ గారు నేటి ప్రత్యేకసమావేశంలో ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. సమావేశానికి బోర్డు అధ్యక్షుడు మహాబలేశ్వరప్పగారు అధ్యక్షత వహించారు. రంగనగౌడ్ గారి పేరును సెక్రనాగప్పగారు ప్రతిపాదించారు. చెన్నబసవన్ గౌడ్‌గారు బలపరిచారు. మరెవ్వరిపేరు ప్రతిపాదింపబడనందున రంగనగౌడ్ గారే ఎన్నికఅయినట్లు ప్రకటింపబడింది.

గత 30 సం॥ల నుండి జిల్లాబోర్డు కార్యదర్శిగా పనిచేసి, ఇటీవల విరమించిన నంజుండయ్యగారి సేవ నగ్గడించుచు ఒక తీర్మానం చేసిరి.

బోర్డు ఉపాధ్యక్షుడుగా ఎన్నికైన బడెనహాళ రంగనగౌడుగారు సభ్యులకు తమ కృతజ్ఞతను తెలుపుచు, మున్ముందీ జిల్లా సమస్యలను పరిష్కరించుటలో ఇట్లే ఐక్యత వుండవలెనని వాంఛించిరి. బళ్ళారి, శిరుగుప్ప తాలూకాలలో వెల్లువ బాధితులకు సహాయమొనర్ప ధనములేదని బోర్డువారు తీర్మానించిరి.

# జపాన్‌తో పశ్చిమ రాజ్యాల ప్రత్యేకసంధి

## త్వరలోనే అధికార సమావేశం

సిడ్నీ, నవంబర్ 14: రష్యాసుతోసిరాజని జపాన్‌తో ప్రత్యేకసంధి ఒడంబడిక చేసుకొనటానికి బ్రిటిష్, అమెరికన్, ఆస్ట్రేలియన్ ప్రభుత్వాలు ఒక అంగీకారానికి వచ్చినవనీ, అంతూపొంతూ లేకుండా శాంతి సమావేశాన్ని వాయిదావేయటానికి బదులుగా రష్యాలేకుండానే వచ్చే సం॥ మొదట్లో జరపాలని నిశ్చయించుకున్నవనీ నిన్నరాత్రి ఒకరాజకీయ వర్గం ఇక్కడ సూచించినది.

జపాన్ శాంతి ఒడంబడిక సులభంగా సానుకూలపడే నిమిత్తం ఆస్ట్రేలియా తాను కోరుతున్న యుద్ధపరిహారాలను వదులుకొనటానికి కయితే ఇష్టపడుతున్నది కాని జపాన్ వారు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ లకు పవిపంగా ఉన్న దీవులకు నలసరాకుండా నిషేధించవలసినదని మాత్రం పట్టుబడుతున్నది. జపాన్ తిరిగి సైనికంగా విజృంభించకుండా చేయాలని ఆస్ట్రేలియా చూపుతున్న పట్టుదలను బ్రిటన్ సమర్థిస్తుందని తెలుస్తున్నది. (గ్లోబ్.)

### చెయ్యనేర్పరుల సాయ

మదరాసు, నవంబరు 14:— చెయ్యనేర్పరుల సాయకు సహాయార్థి వృద్ధి కార్యక్రమముక్రింద ఇచ్చిన మినహాయింపు 1949 నవంబరు 8 నుండి ఉపసంహరించినట్లు ప్రభుత్వము ప్రకటన చేసెను.

# "రాయలసీమ వారికి పట్టాభిగారి మాట శ్రీరామరక్ష"

## రాయలసీమ శాసనసభ్యుల హర్షం: కౌన్సిలు సభ్యుల భవిష్యత్తుపై ఊహాగానం

చెన్నపట్నం, నవంబరు 14: ఆంధ్రరాష్ట్ర నిర్మాణానంతరము ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీలో కౌన్సిలు సభ్యులు 20 మందిని గూడా చేర్చి అసెంబ్లీసంఖ్యను తానికి పెంచవచ్చునని మద్రాసు రాజకీయ వర్గముల వారు ఊహించుచున్నారు. ఆ ప్రకారం మైన ఆంధ్ర అసెంబ్లీలో కాంగ్రెసు సభ్యుల సంఖ్య 81. కాంగ్రెసేతరుల సంఖ్య 18. ఉండగలదు ఆంధ్రరాష్ట్రము విడిపోయినపుడు, ఆంధ్రరాష్ట్ర రాజధాని మద్రాసు ఫోర్టు సెంట్‌జార్జిలో ఉండుటకు వీలులేదనియు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అట్టి తీర్మానము చేసినదివారి, అంతకన్న తమకు గత్యంతరము లేదనియు తమిళ నాయకులు తెలుపుచున్నారు. ఆంధ్రుల రాజధాని, తాత్కాలికముగా రెవెన్యూబోర్డు మున్నగు భవనాలలో పెట్టుకోవచ్చునను చున్నారు. కాని ఫోర్టులోని కొత్త భవనములను ఆంధ్ర సెక్రటేరియట్‌గా అధికారులు ఎంతకాలంనుంచో పిలచుచున్నారు.

ఆంధ్రరాష్ట్ర ఆర్థిక పరిస్థితినిగూర్చి ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు చేసిన ప్రకటనలో చెన్నపట్నం ఆదాయ వ్యయములను రిశీలించిన ఆర్థికవేత్తలు,ఆదాయపు పన్ను, పుగాకుపన్నులపైన కేంద్రము ఇచ్చువిరాళములు జనాభా ప్రకారము ఆంధ్ర రెవెన్యూలకు కలపినచో ఆంధ్రుల బడ్జెటు లోటుగా ఉండదని తెలుపుచున్నారు. ఇక మంత్రుల సెక్రటేరియట్ హైకోర్టు ఇతర కార్యాలయముల సిబ్బంది జీతములు ఏదో విధముగా డబ్బు చూపవలని ఉండునవుచున్నారు. తమిళులు ఏమిచెప్పినను రాజధానీ నగరము తేలువరకు ఆంధ్రులు ఫోర్టు సెంట్‌జార్జిలోనే ఉండెదరని ఆంధ్రవర్గములవారు తమ నిశ్చయమును తెలుపుచున్నారు.

రాయలసీమ శాసనసభ ప్రతినిధులు మటుకు నిన్న రాయలసీమ మహాజనసభ చేసిన తీర్మానము ఏదో పదిమంది అసంతృప్తులైన వ్యక్తులు చేసిన తీర్మానము గాని రాయలసీమ అభిప్రాయముగా ఎవ్వరునూ పరిగణింపరాదని తెలుపుచున్నారు. నాయకంటి శంకరరెడ్డి ఎం. ఎల్. సి. గారు ఇటుల తెలుపుచున్నారు:—

"ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము వారు చేసిన తీర్మానము ఎంతయో యుక్తముగానున్నది. రాయలసీమవారు ఎంతసౌసబబుగా వ్యవహరించినారు. సర్కారు సోదరులు గూడా శ్రీ బాగ్ ప్యాక్టును పాలింతురని. తమ ప్రమాణములను పునరుద్ఘాటన చేసినారు విజయవాడలో పాదింపబడిన రాయలసీమ సర్కారుల సామరస్యము చిరస్థాయిగా గలదని ఆశించుచున్నాను."

గోపవరం వెంకటరెడ్డి ఎం. ఎల్. ఎ. గారు ఇటుల తెలుపుచున్నారు:—

"రాష్ట్ర కాంగ్రెసువారి తీర్మానము యుక్తముగాను, న్యాయముగాను, వివేకవంతముగాను ఉన్నది. రాయలసీమ వారిందులకెంతయు సంతోషించుచున్నారు. రాయలసీమవారు సమయం వచ్చేసరికి తమ ఔదార్యమును ప్రదర్శించి ఉదార సత్కీర్తులను సంప్రదాయమును నిలబెట్టుకొన్నారు. ఇక సర్కారు సోదరులు గూడా శ్రీ బాగ్ ప్యాక్టు అమలులో వారు సహజమైన సౌదార్యమును ప్రదర్శించగలరని రాయలసీమ వాసులు ఆశించుచున్నారు. ఇకనుంచీ రాయలసీమ సర్కారులు ఒక్కటేనని ఆంధ్రులైనవారందరు ఆశించుచున్నారు."

నారు రంగారెడ్డి ఎం. ఎల్. సి. గారు ఇటుల తెలుపుచున్నారు: "ఇక ఆంధ్ర రాష్ట్రము వచ్చినట్లే ఎంచుకొనవచ్చును. అది ఎటులనో చెప్పో రహో రాగలదు. రాయలసీమకిచ్చిన రక్షణలు, ప్రమాణములు సర్కారు సోదరులు పాలింపవలసి ఉన్నది. శ్రీబాగ్ ప్యాక్టును అమలుచేసి నచో రాయలసీమ వారికిక కావలసినది లేదు. ఏమకంఠంలో ప్రాణంఉన్నంతవరకు ఈ ఒడంబడిక పాలింపబడునట్లు చూచెదమని రాష్ట్రపతి భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఈ మధ్య రాయలసీమలో గావించిన వాగ్దానముకన్న రాయలసీమ వాసులకిక కావలసినదిలేదు. పట్టాభిగారిమాట రాయలసీమవారికి శ్రీ రామరక్షగా ఎంచుకొనుచున్నారు. చెన్నపట్నాన్ని ఏకకమిషనరు రాష్ట్రంగా చేయవలెను. ప్రజాన్యాయ ముఖ్యమే చెన్న పురిలోని వివిధభాషా వర్గములవారికి న్యాయమును కూర్చవలెను. చెన్నపట్నం ఉన్నత పరిస్థితులు చూచినచో చెన్నపట్నం అంతర్జాతీయ కేంద్రమనివేరే గలను చెన్నపట్నాన్ని ఏకకమిషనరు రాష్ట్రంగా చేసినప్పుడు చెన్నపట్నం వృద్ధికి తోడ్పడిన అన్ని భాషావర్గాలవారికి కేంద్రప్రభుత్వంవారు న్యాయం చేసినవారు అగుదురు."

# నెహ్రూ షష్టిపూర్తి

## ఆంధ్రదేశంలో ఉత్సవాలు

హైదరాబాదు, నవంబరు 15: ప్రధానామాత్యుడు పండిత జవహర్లాల్ నెహ్రూ షష్టిపూర్తి సందర్భంలో నిన్న ఇచ్చట మేజర్ ఎం. జి. నాయుడుగారి అధ్యక్షతను, హైదరాబాద్, సికందరాబాద్ నగర పౌరుల బహిరంగసభ జరిగింది. అన్నివర్గములకు, వర్ణములకు చెందిన పలువురు ప్రముఖులు పండిత నెహ్రూ గుణగణములను ప్రశంసిస్తూ ప్రసంగించిరి.

భారతజాతి పిత ప్రవచించిన సత్యం అహింస అనే ఉన్నత సిద్ధాంతాల ప్రచార భారవాహుడైన పండిత నెహ్రూ, దౌర్జన్య విద్వేషాలతో అంధకార బంధురమైన ప్రపంచంలో వెలుగు ప్రసరింపచేశారనీ, అట్టి మహామహుని సమకాలికులమగుట మన పూర్వపుణ్య విశేషమనీ, సభలో తీర్మానించారు.

స్వామి రామానందతీర్థ, బూర్గుల రామకృష్ణరావు, అబుల్‌హసన్‌సయ్యదల్లీ, రుస్తుంజీ పతి, బేగం సోగియా హుమాయూన్, కాశీనాథరావ్ వైద్య, జ్ఞానకుమారి హెడా ఆక్బరల్లీఖాన్‌సతి ప్రసంగించిరి.

### మచిలీపట్నం

స్థానిక జాతీయ సేవాసమితి అధ్యక్షుడైన, డాక్టర్ జె. వెంకట్రామ శర్మ గారి అధ్యక్షతను ప్రధానామాత్యుడు పండితనెహ్రూ షష్టిపూర్తి ఉత్సవం, సభ జరిగెను. నెహ్రూను 'శాంతిదూత' అనీ, 'ఆసియా నాయకుడు' అనీ పేర్కొంటూ, అద్వితీయ నాయకత్వాన వ్యవహరిస్తున్న భారత ప్రభుత్వం, ఆంధ్రరాష్ట్రాన్ని, నాయకత్రయ నివేదిక ననుసరించి వెంటనే ఏర్పాటు చేయవలెనని కోరుతూ తీర్మానించారు.

ఈ పురపాలక సంఘంవారు 12-వ తేదీ సాయంత్రం చైర్మన్ గా. అచ్యుతరామయ్యగారి అధ్యక్షతను సమావేశమై, 'భారత ప్రధానమంత్రి పండిత నెహ్రూ షష్టిపూర్తి సందర్భంలో వారిని అభినందించుచు తీర్మానించిరి.

### చిత్తూరు

ప్రధానామాత్యుడు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ షష్టిపూర్తి సందర్భమున స్థానికబోర్డు హైస్కూలులో 14-వ తేదీ ఉదయం జాతీయ పతాకోత్సవము జరిగెను. పిమ్మట నెహ్రూగారి పటమును పురవీధులలో నూరేగించిరి. సాయంత్రం ఆర్. శ్రీనివాసరావ్ గారి అధ్యక్షతను జరిగిన సభలో నెహ్రూగారి జీవిత చరిత్రనుగురించి పలువురు ఉపన్యసించిరి.

గాంధీ బాలసేవాసంఘమువారు రామావిలాస్ సభలో ఉదయము పతాకోత్సవము జరిపిరి. తర్వాత పటము ఊరేగించిరి. సాయంత్రం చిన్న నాటకముప్రదర్శించిరి.

### నగరి

నగరి, నవంబరు 14: నేడు ఈఫిర్కాలో పలు గ్రామాలలో భారత ప్రధానామాత్యుని 61వ.జన్మదినోత్సవము జరిపి స్థానిక ప్రముఖులు ప్రధానామాత్యుని సుగుణములను కొనియాడిరి. వారికి ఆయురారోగ్యములుకలిగి ఎల్లప్పుడు మన నాయకులై దీర్ఘకాలము వర్ధిల్లవలయునని దైవప్రార్థనలు జరిపిరి.

### బళ్లారి

బళ్లారిజిల్లా బోర్డు ప్రథమ సమావేశం నేడు జరిగినప్పుడు మొదట పండిత నెహ్రూగారి షష్టిపూర్తి సందర్భమున వారికి సుభాకాంక్షలు తెల్పుచు ఒకతీర్మానము చేసిరి.

### ఆదోని

ప్రధానామాత్యుడు పండిత నెహ్రూ షష్టిపూర్తి ఉత్సవము 14న యిక్కడ జిల్లా కాంగ్రెసు పట్టణ కాంగ్రెస్ సంఘముల అధ్యక్షాన జరిగె. 10-30 గం మున్సిపల్ మైదానంలో ఇంద్రచంద్‌గారు పతాకమును ఎత్తిరి మధ్యాహ్నము 2½ నెహ్రూ చిత్రమును ఊరేగించుటకుగాను సన్నాహములన్నియు జరగినవి. ఈసందర్భమున పట్టణమున ముఖ్య రహదారులయందు మేళతాళములు నిలుపకుండా ఊరేగించుటకుగాను 2 దినములు ముందుగనే జిల్లా కలెక్టరుగారి నుండి ఉత్తర్వు పొందియుండిరి పట్టణమువలి ముస్లింలు మసీదునుండు పోరావని ప్రభుత్వమునారి? తెలుపుద్వారా తెలుపు లెన్న బరువ ఈ దినం 1 గం నిలుపవలెనే యవలెనని ఉత్తర్వువచ్చినవని వదంతి జయలుదేరి నందున ఊరేగింపుసాగలేదు.

# కొత్త రాజ్యాంగంలో మధ్య పరగణాలకు పేరు మార్పు

నాగపూరు, నవంబరు 14: మధ్యపరగణాలు బీరారు చేరిన రాష్ట్రమునకు కొత్త రాజ్యాంగ చట్టమునందు "మధ్యప్రదేశ్" అని పేరుపెట్టవలెనని మధ్య పరగణాల ప్రభుత్వ మంత్రివర్గము ఇండియాప్రభుత్వమునకు సూచించినది ప్రస్తుతము రాజ్యాంగచట్టపు ముసాయిదాలో ఉన్నమధ్య పరగణాలు బీరారురాష్ట్రం "కోసల విదర్భ" అని పేర్కొనబడియున్నది.

### ఆహారమంత్రి పర్యటన

మద్రాసు ఆహారమంత్రి లోకనాథ విక్టోరియాగారు 19 న విమానంలో తిరువనంతపురంవెళ్ళి 20 సాయంత్రానికి తిరిగి మదరాసు చేరెదరు.

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 17 గురువారం

## మద్రాసు (ఎ)

ఉ॥ 7-30 డి. సుందరరాజన్ పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి). 8-30 మద్రాసు (బి) వలె మ॥ 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా రికార్డులు. 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా॥ 5-30 ఎస్. డి. సుబ్బస్వామి నాగస్వరం. 6. ఆంగ్లమున వార్తలు. 6-20 ఎం. ఎస్. మోహనాంబాళ్. 7 క్లారినెట్, ముఖ, వీణ. 7-30 గీతమంజరి (రి). 7-45 మదరాసు (బి) వలె. 8-15 రాగం, తానం, పల్లవి, ముదికొండాన్ వెంకట్రామయ్యర్ గాత్రం. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 విజయవాడవలె 9-30 మద్రాసు (బి)వలె. 10 వాద్యసంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వార్తలు. 7-15 చూడామణి (రి). 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 చాగంబాల వయొలిన్. మ॥ 12 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు, ఎవరేమి చేస్తారు. నాకానాయకుని విధులు, భాగ్యతలు ప్రసంగం, సంగీత పాఠాలు. 1 మహిళా మండలి, జాగ్రత జాగ్రతి ను ప్పూరి వారి గేయం, సన్నిహిత ప్రాంతీయులు టర్కీ ప్రసంగం. ఆర్. కనకదుర్గా రామచంద్రన్. వాద్యసంగీతం. పద్యపఠనములు. ఎన్. ఎ. కళ్యాణీ వరదరాజన్ 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు 2-14 ఉన్నత పాఠశాల విద్యార్థులకు రాజకీయ విప్లవములు. టర్కీ విప్లవము ప్రసంగం. కె. ఎస్. రామయ్య మహాత్మాగాంధి నిర్మాణ కార్యక్రమం. గ్రామపునర్నిర్మాణము. ప్రసంగం. ఎస్. కన సుందరం. 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు రాజచరిత్రలు. మహ్మద్ బిన్ తుగ్లక్ ప్రసంగం. కె. సూర్యనారాయణ ప్రశ్నలు జవాబులు ముత్యాలపేట ఉన్నత పాఠశాలా విద్యార్థులకు ఆటపాటలు. కేంద్ర ప్రాథమిక పాఠశాలా సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయంసంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. విమల భారత కవితాంజలి గేయం. స్వప్న పీఠ. కథానిక రచన:— విశ్వేశ్వరరావు. విశేషాలు, ప్రకటనలు. ధరలు, వాతావరణ వివరాలు. 7-0 తెలుగున వార్తలు 7-15 గీతావళి 7-45 జానపద క్రీడాకలాపములు. వీధి భాగవతము ప్రసంగం. ఎన్. వెంకట్రావు. 8-15 మద్రాసు (ఎ) వలె. 9-30 ఎస్. పి. గంగాధరణ్ పాట. 10-0 సినిమా సంగీతం రికార్డులు.

## విజయవాడ

ఉ 7. తెలుగున వార్తలు 7-15 బి. ఎస్. రాజయ్యంగార్. రికార్డులు. 7-30 కె. వి. రెడ్డి. వయొలిన్. 8. ఆంగ్లమున వార్తలు 8-15 నిలయవిద్వాంసులు. వీణ వేణు 8-30 టి. జి. ఎస్. వీరరాఘవాచారియర్. పాట. మ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1 తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగుల వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4. ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా 5-30 టి. జి. ఎస్. వీరరాఘవాచారియర్ పాట 6. ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి రాజేశ్వరరావు. బాలసరస్వతి రికార్డులు 6-30 గ్రామసుల కార్యక్రమం (మద్రాసు నుండి) 7. తెలుగున వార్తలు 7-30 కె. రామేశ్వరి పాట. 7-45 నిజానిజ పరిశీలన 2 అవతారి నోట్లో నూగింజ నానదు. ప్రసంగం. కె. సి. వెంకట్రావు. 8. పెళ్ళి కూతురికి నాటిక. వింజమూరి శివరామారావు. 8-15 విజయవాడ శేకిసెనో ఆర్కెస్ట్రా 8-30 కల్పలత శ్రోతలు కోరిన రికార్డులు 9. ఆంగ్లమున వార్తలు 9-15 విశ్వవిద్యాలయాలకు విమానశాఖ ఆంగ్లమున ప్రసంగం. గ్రూపుకాప్టెన్ ఆర్. రాజారామ్. 9-30 కె. వి. రెడ్డి వయొలిన

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 15

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-8 ఎద్దరు ... కీల్పుటార్సుతో సహా రు 77 0-0 పె. బంగారు తులం 116-0-0 మూసబంగారు 113-12-0 సీమవెండి తులం 100-8 (?) 168-0-0 వెండి తులం 1 8 1-11 6

షేరుసెనగ: (581 కా 1-8 ఎద్దు కొత్తగిడ్డంగులు) మిషీన్(సేల్సు టాక్సుతో సహా) బజారురు కొత్తది 156, 157-0-0 షేరు సెనగనూనె ఎక్సుపెల్లర్ (ఏవరేజి) నవంబరు డెలివరీ అండ్ రు. 329, 330 3 టు 5% యఫ్. యఫ్. ఎ., ... (37 ... గల డబ్బా) ఒకటికి రు. 33-8-9, పెహాంగు.

ఆముదం
కాండి 500 పౌనులుగలది రు. 290, 290

పంచదార
ప్యారీ (2 అందరు) రు.91-14-6
చక్కెర చిల్లరధర వీశ 1-8 1-4-9

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 14:

అక్టోబరు వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | వెల | 29.89 |
| ,, ముగింపు | వెల | 29.9) |

## ఎగుమతులపై అమ్మకాలపన్ను

### రాజ్యాంగచట్టంలోనుండే గడుపు పర్యంతముండును

చెన్నపట్నం, నవంబరు 14: రాష్ట్రంనుండి యితర ప్రదేశాలకు ఎగుమతులమీద అమ్మకాలపన్నును మదరాసు ప్రభుత్వము ఉపసంహరించలేదనియు అట్టి చర్య ప్రభుత్వమిపుడు తీసుకోదలచలేదనియు ఎగుమతులమీద అమ్మకాలపన్ను ఎత్తివేయవలెనని కొత్త రాజ్యాంగచట్టములోనున్న షరతును అందుకు నిర్ణయమైన గడువు ముగిసే పర్యంతము మదరాసు ప్రభుత్వము అనుసరింపదలచలేదనియు అర్థికమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు అసెంబ్లీలో యీ విషయమున ప్రశ్నలకు జవాబుగా చెప్పిరి.

ఎగుమతుల ప్రోత్సాహ కమిటీ సిఫార్సును ఇండియా ప్రభుత్వము అంగీకరించియున్న కారణమున చెన్నరాష్ట్రమునుండి యితర ప్రాంతాలకు ఎగుమతి అయ్యే సరకులపై అమ్మకాలపన్నును మినహాయించే విషయము ప్రభుత్వము ఆలోచించుచున్నదాయని మంత్రిగారు ప్రశ్నింపబడిరి.

మంత్రి:—దాని విషయమై ప్రభుత్వము ప్రస్తుతము ఎట్టి చర్యగాని తీసుకోదలచలేదు. రాష్ట్రమునుండి ఎగుమతులమీద అమ్మకాలపన్ను వేయడం నిషేధిస్తూ కొత్త రాజ్యాంగచట్టములో షరతు చేర్చబడి అందుకు ఒక గడువు నిర్ణయమైయున్నది. ఆ గడువువరకు ఎగుమతులపై అమ్మకాలపన్ను యుండును.

ఆదాయపన్ను అప్పీల్ల ట్రిబ్యునల్ మాదిరి అమ్మకాలపన్ను అప్పీళ్లు పరిష్కరించుట కొక ట్రిబ్యునల్ ఏర్పాటు చేయుటగూర్చి అమ్మకాలపన్నుకు సంబంధించిన నియమావళి తయారైన తరువాత ఆలోచింపబడునని మంత్రిగారు మరొక ప్రశ్నకు సమాధానముగా నుడివిరి.

శ్రీ టి. విశ్వనాథం:—ఈ రాష్ట్రంలో అమ్మబడు రైల్వే టిక్కెట్లపై అమ్మకాలపన్ను విధించుటగూర్చి ప్రభుత్వము ఆలోచించగలదా?

శ్రీ గోపాలరెడ్డి: ప్రస్తుతానికి మాకట్టి అధికారాలులేవు. అట్టి అధికారమున్నట్టయితే ఆ విషయంకూడా ఆలోచించవచ్చు.

ఎగుమతులు ప్రోత్సహించి వాణిజ్యము అభివృద్ధిచేయడం అవసరముగనుక వాటిమీద అమ్మకాలపన్నును ముందుగ తొలగించడం అవసరముకాదా యనే ప్రశ్నకు బదులుగా అట్టి చర్యవల్ల ప్రభుత్వాదాయము తగ్గునని మంత్రిగారు పలికిరి.

ఎగుమతులపై అమ్మకాలపన్ను తొలగిస్తే దాదాపు ఒక కోటి రూపాయలు ప్రభుత్వము బహుశా కోల్పోవలసి యుండునని శ్రీ గోపాలరెడ్డిగారు యీ సందర్భములో నుడివిరి.

#### కంపెనీలకు ప్రభుత్వ సహాయము

సుదర్శన నూలుమిల్లుకు ఆంధ్రదేశములో మరికొన్ని మిల్లులకు ప్రభుత్వము చేసిన ధనసహాయముగూర్చి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు అడిగిన ప్రశ్నకు పరిశ్రమలమంత్రి యీ విషయమున సమాధానమొసగిరి.

కర్నూలు సిమెంటువారు ప్రభుత్వ ద్రవ్య సహాయమునకై దరఖాస్తు పెట్టలేదు. సుదర్శన నూలుమిల్లు (కొవ్వూరు) మోహన్ షైల్ వర్క్సు (తెనాలి) రాయలసీమ మిల్సు లిమిటెడ్ (ఆదోని) ఈ మూడు కంపెనీలు పెట్టిన దరఖాస్తులు ఆలోచించినపుడు పరిశ్రమలబోర్డు సభ్యులెవరు హాజరైనారో వారి పేర్లుగల ప్రకటన సభవారి యెదుటనున్నది. పరిశ్రమల బోర్డు సమావేశం వివరాలు బహిరంగపరచడం భావ్యంకాదు. పై మూడు కంపెనీల ఆస్తిపాస్తుల వివరాలుగల ప్రకటన కూడా సభవారికి అందచేయబడియున్నది.

రజాఖాన్‌గారు వార్తాపత్రికలకు ప్రభుత్వ ద్రవ్యసహాయము నొసగ వీలున్నదాయని ప్రశ్నించగా ఆవిషయముగూర్చి గౌరవ సభ్యుడు ప్రత్యేక ప్రశ్న వేయవలెనని మంత్రిగారు సమాధానమిచ్చిరి.

#### యం. యల్. ఏ. లచే ప్రభుత్వ ఫైళ్ల పరిశీలన

మంత్రులమీద ఆరోపణల పరిశీలన సందర్భమున కొందరు యం. యల్. ఏ. లకు ప్రభుత్వ ఫైళ్ళను ఎవరి అధికారము మీద చూపబడెనని రజాఖాన్‌గారు అడిగిన ప్రశ్నకు సభానాయకుడు బదులు చెప్పుచూ ప్రధాని అనుమతిమీద చూపబడినవనియు, అన్ని ఫైళ్లు అవినయమున చూపబడినవో లెక్క లేదనియూ ఆరోపణలకు సంబంధించిన ఫైళ్లమాత్రమే ఇవ్వవలసి వచ్చెనియు నుడివిరి.

ఈ ప్రకారమే మరే యం. యల్. ఏ. కైనా తనకు అవసరమని అడిగిన ఫైళ్ళను అతనికి చూపుటకు ప్రభుత్వమువారు సిద్ధపడగలరాయని రజాఖాన్‌గారు ప్రశ్నించిరి.

ప్రధాని అభిప్రాయములో అవినయమున ఫైళ్ళను చూపితేనేకైనా చూపవలసిన అగత్యము ఏర్పడవచ్చునో ఆ ఫైళ్ళలో గల వర్తమానములను ఆ సభ్యునకు చూపవలెనని ఏ పరిస్థితిలోనైనా చూపబడరాదని సమాధానమిచ్చిరి.

## 'కోస్తాజిల్లాలకు కలిగిననష్టం రాష్ట్రానికంతటికి కలిగిందిగా భావించాలి'

### అసెంబ్లీలో తుపాన్‌బాధితులకు ప్రభుత్వ సహాయకార్యక్రమంపై తీవ్ర విమర్శ

మదరాసు, నవంబర్ 14: నేడు అసెంబ్లీయందు ప్రశ్నోత్తరములు ముగిసినాక రివెన్యూశాఖ మంత్రిగారు, ఆంధ్రదేశమునందలి తుపానునష్టంగూర్చి చర్చింప గోరుచు, నష్టంవివరాలగూర్చి ప్రభుత్వంవారు చేసినసహాయ కార్యములగూర్చి కౌన్సిలులో ఉపన్యసించదలచిన ప్రకటనతిరిగి చదివిరి. (ఈ ప్రకటన పూర్తిగా 'ఆంధ్రపత్రిక'లో నిన్ననే ప్రకటింపబడినది.)

ఇండియాలో ఏ ప్రాంతాల కష్టం వచ్చినా సహాయంచేయుటకు ముందుకు ఉరికే ఈ ప్రాంతాలకు యిపుడందరు తగినీతి సహాయంచేయుదురని నమ్ముచున్నానని మంత్రిగారనిరి.

20 మంది సభ్యులు చర్చలోపాల్గొనదలచిరి. కావున బుధవారంవరకు యీ విషయం చర్చింపబడునని అధ్యక్షులు సూచించిరి.

తరువాత పబ్లికువర్క్సుశాఖ జలాధారములకు కలిగిన నష్టంగూర్చి మంత్రి భక్తవత్సలంగారు వివరంగా నొకప్రకటన గావించిరి. (ఈ ప్రకటన విడిగా ప్రకటింపబడినది.)

#### సవరణలు

పిఠాపురం యువరాజాగారు రూ 3 కోట్లు సహాయార్థం ఖర్చుచేయాలని ప్రభుత్వాన్ని కోరుచు ఒకసవరణ ప్రతిపాదించగ, అబ్దుల్ సలాంగారు సవరణ బలపరచిరి.

కౌలుదారునిభూస్వామినుండి రక్షించుటకు ఒకచట్టం అమలుజరుపగోరుచు అల్లూరి సత్యనారాయణరాజాగారు వేరొక సవరణ ప్రతిపాదించిరి.

తుపాను వరదలు కూడా కష్టపెట్టిన ప్రాంతాలకు రూ 2 కోట్లు సహాయం చేయాలని డి. ఏ. రామస్వామిగారు మూడోసవరణ ప్రతిపాదించిరి.

పిఠాపురం యువరాజాగారు సవరణపై ప్రసంగించుచు, ప్రకృతి ప్రకోపించి చేసిన నష్టానికి ప్రభుత్వంవారు చేస్తున్న యీ కొద్దిపాటి సహాయం చాలునాయని ప్రశ్నించిరి. 3కోట్లు యిమ్మనగా డబ్బులేదంటారు. అమాయకులగు ప్రజలు నాశన మవుచుండగా యితర పనులన్ని నిలిపివేసి సహాయ కార్యాలు చేయాలి. అధికారంలో నున్న పార్టీయే ప్రభుత్వాధికారము నందున్నది కనుక, ప్రభుత్వం తగిన సహాయం చేయకున్నచో పార్టీకి మాట వచ్చును. ప్రజలు యీ పార్టీయందు అసంతృప్తి చెందిరి" గా॥ మాధవమీనన్ - పార్టీకిని తుపానుకి సంబంధం ఏమిటి?

అధ్యక్షులు (అమ్మన్నరాజా) - చర్చయందున్న తుపాను విషయంగూర్చియే మాట్లాడుట మంచిది.

యువరాజా - ప్రభుత్వంవారు సరిగా పని చేయలేకున్నందున తుపాను సహాయ కార్యాలందు ప్రజలతోడ్పాటును బడగాలేకున్నారని చెప్పదలచితిని. మంత్రులపై ఫిర్యాదులు పత్రికలలో ప్రకటింపబడిన పిమ్మట, అవి తొలగింపబడునంత వరకు......

అల్లూరి సత్యనారాయణ: మంత్రులపై ఫిర్యాదులకు, తుపానుకి సంబంధం ఏమిటి?

అధ్యక్షులు:—ప్రజాసహాయం రాకుండా ఉందంటున్నారు. పూర్తిగ వినండి తెలుస్తుంది.

యువరాజా, తాత్కాలికంగా రక్షణ మొసంగినందుకు అధ్యక్షులవారికి వందనములు అర్పించుచు, ప్రభుత్వానికి ప్రజాసహాయం ఉండాలంటే, లోపాలు లేకుండా చూసుకోవాలనిరి.

సర్ మహమ్మద్ ఉస్మాన్ (?) గారు: యిప్పటికైనా ఆలశ్యం కాలేదు. మంత్రులలో సగం మంది ఆ ప్రాంతాలకు పోయి నివాసముండి ఎక్కువ సహాయం చేయాలనిరి. ఇపుడిచ్చిన సహాయం, ఏ మాత్రం చాలదు. ఎన్నికోట్లో చెప్పలేంగాని, యింకా ఎక్కువ ఖర్చు చేయాలి. ప్రభుత్వం ఎంత ఖర్చుచేసినా సభవారు ఆమోదించెదరు. ప్రత్యేకంగా ఒక ఉన్నతాధికారిని నియమించి, ఆప్రాంతాన ఉంచి, అన్నిరకాల పనులు చేయుటకు అధికారం యివ్వాలిగాని, అక్కడనుండి కాగితాలు రావడం యిప్పటి అన్ని శాఖలలో తిరిగి మంజూరైనాక సహాయం చేయడంవల్ల పని కాదు. ఎన్నికలు యున్నవనియో మంత్రిగారు యిపుడే చెప్పవచ్చో కొన్ని కోరు సవరణలు

ఫైళ్లు లేక స్వయముగా చూపెట్టలేనా అట్టి యం. యల్. ఏ. లకు తెలుపుటకు ప్రధానికి అధికారమున్నదని ప్రస్తుత సందర్భములో రజాఖాన్ ఫైళ్ళు చూపలేనికూడా సమాధానమిచ్చిరి.

రాలేరావు. మాటల సానుభూతి చాలదు.

డా॥ శ్యామ్యూల్ (?) గారు, ఇంస్పెక్టరుటకు యిచ్చే చేరి రూ 15 యింస్టలు చాలవనిరి. కలప తెచ్చుకొనుటకు ఉచిత పెర్మిటులు యివ్వాలిగాని సామాను లేనిది రూపాయిలిచ్చిన ఖర్చయిపోవునని.

సెప్టెంబరు వరదలగూర్చి శ్యామ్యూలుగారు చెప్పచుండగ అధ్యక్షులవారు మంత్రిగారి ప్రతిపాదనయందు యిటీవలి తుపానుగూర్చియే ప్రతిపాదించిరిగాని, అంతకుముందు వరదలగూర్చి చెప్పలేదనిరి.

మంత్రి హ. సీ. రెడ్డిగారు: వివరాల ప్రకటనలో రెండింటిగూర్చి చెప్పితిని.

అధ్యక్షులు: కాని ప్రతిపాదనలో వరదలు చేర్చలేదు.

మంత్రి- తుపానువల్ల వరదకూడ సంభవించింది.

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు, తమ ప. గోదావరిజిల్లాకు యితర జిల్లాలకన్న ఎక్కువ నష్టంవచ్చిందనియు, 80% వంతు పంట నష్టంరాగా 25% మాత్రమే అని రివెన్యూబోర్డువారనుట సరికాదు. నాల్గుకోట్లు యిచ్చినా ప్రజలకు కలిగిన నష్టం తీరదు. కనుక రయితులకు స్థిరమయిన సహాయం చేయాలంటే, భూస్వాములు తరువాత కౌలుదారులను పీడించకుండా చేయాలనిరి. దావాలు కూడ దయలేకుండా వేస్తారనియు, అది జరుగకుండా చూడాలనిరి. అందుకొక చట్టం చేయాలని, పోగా మిగిలినధాన్యం భూస్వామికి రయితుకి సరిసమానంగా పంచే యేర్పాటు చేయాలనిరి. దక్షిణాదినుండి విత్తనాలు తెప్పించి రెండవ పంటకు ఆంధ్రదేశంలో సప్లయి చేయాలి. దీర్ఘవాయిదా ఋణాలు యివ్వాలనిరి. శిస్తు రిమిషనులు యివ్వాలనిరి. ప్రాజక్టులు కడతామని వాగ్దానాలు చేసిరేగాని, యీ నష్టం మరీ ఎక్కువయిందని, యిపుడయినా వాటిపని త్వరగా అమలు జరపాలని కోరిరి. తమ సవరణ సభవారు బలపరచాలనిరి.

డా॥ వి. రామస్వామిగారు, ఆంధ్రదేశానికి కలిగిన యీ ప్రమాదం రాష్ట్రమంతటి ఆహారస్థితికిని నష్టంకలిగించింది. కనుక ఒకప్రాంతానికే సంబంధించినదిగా భావించరాదనిరి.

సభ రేపు 11 గంటలకు వాయిదా పడెను.

## భూమి తనఖాబ్యాంకు డిబెంచర్లు

### హామీ మొత్తం పెంచుటకు కవున్సిల్ అంగీకారం

మదరాసు, నవంబరు 14: నేడు శ్రీ ఆర్. బి. రామకృష్ణంరాజుగారి అధ్యక్షతను సమావేశమైన లెజిస్లేటివుకవున్సిల్‌లో డాక్టర్ రాజన్ కవున్సిల్ రూల్సు 148 క్రింద హౌస్ కమిటీకి 6 గురుసభ్యులను ఎన్నుకొనవలెనని ప్రతిపాదించిరి.

అధ్యక్షుడు సభను ఆహారపదార్థముల ధరలలో పెరుగుదలను, చర్చించుటకు వాయిదా వేయవలెనని ఒక సభ్యుడు ఇచ్చిన ప్రతిపాదనను అంగీకరించుట లేదని ప్రకటించిరి.

తరువాత హౌస్ కమిటీ సభ్యుల ఎన్నిక ప్రతిపాదనపై శ్రీ ఆర్. సూర్యనారాయణగారు మాట్లాడుచు సభ్యులు కూర్చొనేందుకు, విశ్రాంతి తీసుకొనేందుకు చోటులేదనియు ఈ విషయమై శ్రద్ధ తీసుకొనవలెననిరి.

శ్రీ వెంకటస్వామి నాయుడుగారు ఆంధ్రరాష్ట్రము ఏర్పడు విషయం తేలిన తరువాత క్వార్టర్లు ఏర్పడుననియు అప్పుడు ఎక్కువ సౌకర్యములు చేయవచ్చుననిరి.

శ్రీ వి. కె. జాన్ కమిటీని ఎన్నుకొనవలెనా, అక్కరలేదా యను విషయమై సభకు స్వాతంత్ర్యమున్నదనిరి.

నియమముల ప్రకారము కమిటీ ఏర్పడవలెనని యున్నది గనుక కమిటీని ఎన్నుకొనవలెనని డాక్టర్ రాజన్ అనిరి.

పబ్లిక్‌వర్క్సుమంత్రి యస్. ఐ. రైల్వే స్థానిక సలహాసంఘమునకు ఒక సభ్యుని ఎన్నుకొనవలెనని ప్రతిపాదనచేయగా కవున్సిల్ అంగీకరించి ఎన్నికకు తేదీ నిర్ణయించెను.

తరువాత స్థానికపాలనమంత్రి శ్రీచంద్రమౌళిగారు భూమి తనఖాబ్యాంకు డిబెంచర్లకు ప్రభుత్వ హామీని 550 లక్షలకు పెంచవలెనని ప్రభుత్వమునకు శిఫార్సు చేయు ప్రతిపాదనను చేసిరి.

శ్రీ యస్. రంగారెడ్డిగారు మెట్ట భూముల తనఖామీద కూడా భూమి తనఖా బ్యాంకు ఋణములు నివ్వవలెననిరి.

ప్రతిపక్షనాయకుడు శ్రీ వి. కె. జాన్ ప్రతిపాదనను బలపరచిరి.

చర్చకు సమాధానమిచ్చుచూ మంత్రిగారు ఇటనిరి. పాతబాకీలు తీర్మానమునకే గాక అధికోత్పత్తి మొదలగు ఇతర పనులకు వినియోగించుకో వచ్చును. 30% ఋణములు చిన్న రైతులకే ఇవ్వబడినవి. మలబారులో కూడా ఋణములు ఉదారముగ యివ్వబడుచున్నవి. మెట్ట భూముల మీద కూడ ఋణములు యిచ్చుటకు అవసరమగు సవరణ తీసుకొని రాబడుననిరి. ప్రభుత్వ ప్రతిపాదన అంగీకరించబడినది.

## మిగులు జిల్లాల్లోని మెట్ట ప్రాంతాల్లో రేషనింగ్ అమలు

### మద్రాస్ కౌన్సిల్‌లో ఆహారమంత్రి ప్రకటన

మదరాసు, నవంబరు 14: మిగులు జిల్లాలలోని మెట్టప్రాంతములలో రేషనింగ్ అమలు జరుపవలెనని ఉత్తర్వు లివ్వబడెనని ఆహారమంత్రి నేడు కౌన్సిలులో శ్రీ మోతే నారాయణరావుగారి ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

ప్రజలు వద్దన్నప్పుడు రేషనింగ్ అమలుజరుపట ఎందుకని శ్రీ భీమారావుగారు ప్రశ్నించగా ఇతరుల క్షేమము నిమిత్తం అమలు జరుపబడుచున్నదని ఆహారమంత్రి తెలిపిరి.

రేషనింగ్‌లో ఇచ్చే మొత్తము చాలక జనము బ్లాక్ మార్కెటులో బియ్యం కొనుచున్న సంగతి తెలియునా అని ఒక సభ్యుడు అడిగిన ప్రశ్నకు ప్రభుత్వమునకు అటువంటిది యేమీ తెలియదని ఆహారమంత్రి జవాబు యిచ్చిరి.

### నూతులకు గ్రాంట్లు

#### ప్రభుత్వవిధాన వివరణ

చెన్నపట్నం, నవంబరు 14: మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు నేడు ఆర్. బి. రామకృష్ణంరాజుగారి అధ్యక్షతన జరిగినపుడు ఈ క్రింది ప్రశ్నోత్తరములు జరిగెను.

మద్రాసు జ్యుడిషియల్ సర్వీసులో జిల్లాజడ్జి 12 పదవులు ఉన్నవనియు, అందు 5 గురిని బారునుండి, 7 గురిని చిన్నగాను ఎన్నుకొందురనియు, శాఖలో ద్యోగుల నియమించకుండా వ్యవహారము నడుపుకొనుచున్న సందర్భములు ఉన్నవనియూ హైకోర్టు జ్యుడిషియల్ సర్వీసు ఏర్పాటు అయినాక అవి నింపబడుననియు ఆర్. సూర్యనారాయణరావుగారికి సమాధానముగా న్యాయమంత్రి మాధవమీనన్ గారు తెలిపిరి.

జిల్లా వైద్యాధికారులను మూడేళ్లలోపల మార్చరాదను నిబంధనలేకపోయినా సంప్రదాయము ఉన్నదనియు, పరిపాలనకు సంబంధించిన, ప్రజలకు సంబంధించిన కారణములవల్ల వారి మార్పులు జరుగుననయు. ఈ మధ్యన అట్టి మార్పులు జరిగెననియు, ఆ మార్పులకు కారణములు చెప్పకూడదనియు సూర్యనారాయణరావుగారికి సమాధానముగా ఆరోగ్యమంత్రి తెలిపిరి.

### దక్షిణాది కంపెనీకి ఋణం

మద్రాసు ప్రభుత్వంవారు ముందు ఎట్టి ప్రచురణ లేకుండా మెస్సర్స్ సదరన్ స్టీమర్ అండ్ జనరల్ ఏజెన్సీస్ లిమిటెడ్ వారికి మైనర్ పోర్ట్స్ నిధి నుండి తూత్తుకుడి కొలంబో సర్వీసు నడుపుటకు రూ. 4,23,100 ఋణము ఇచ్చినారని పబ్లిక్‌వర్క్సుమంత్రి భక్తవత్సలంగారు సూర్యనారాయణరావుగారికి సమాధానముగా తెలిపిరి. స్వదేశీ స్టీమ్‌షిప్ కంపెనీ (మద్రాసు)కు 7½ లక్షలు ఋణం ఇచ్చుటకు కొన్ని నిబంధనలు ఇవ్వబడె

నవిరి.

మద్యనిషేధ శాఖ అక్టోబరు 31 వ తేదీనుంచి రద్దు చేయబడెననీ, మద్యనిషేధ పరిపాలన క్రమక్రమముగా పోలీసుల చేతులలోకి రాగలదని మద్యనిషేధమంత్రి సంజీవరెడ్డిగారు సూర్యనారాయణ రావుగారికి సమాధానముగా తెలిపిరి. మద్యనిషేధ అధికారులే త్రాగి పడిఉంటున్నారన్న డా॥ జాన్‌గారి ఆరోపణ సర్వే సర్వత్రా వర్తించదనియు అట్టివారిని పట్టినచో దండించెదమనీ మంత్రిగారనిరి. దొంగసారాయి వచ్చాక కుటుంబాలు కుటుంబాలే త్రాగుచున్నవనగా కొంతవరకు నిజం గావచ్చు గాని దేశమంతా అట్లు లేదనిరి.

అడవుల్లో పనిచేయు కోయవారికి కనీస వేతన ప్రమాణచట్టం అమలుజరుపు విషయం ఆలోచనలో ఉన్నదని సూర్యనారాయణరావుగారికి సమాధానముగా మద్యనిషేధమంత్రి తెలిపిరి.

ఏలూరు రామచంద్రరావు పేట పార్కులో పూలుకోసుకు పోవుచున్నందున ఉదయం 7 గం.ల మొదలు సాయంత్రం 4 గం.ల వరకు పార్కు తలుపులు వేసి ఉంటున్నవనీ, ఈ సందర్భమున తోట వాళ్లకు జరిమానాలు పడ్డవనీ, కమిషనరు ఈ విషయమై తగు చర్య తీసుకున్నందున ప్రభుత్వం జోక్యం చేసుకో నవసరం లేదని మోతే నారాయణరావుగారికి స్థానిక శాఖామాత్యులు కల్లూరి చంద్రమౌళిగారు సమాధానమిచ్చిరి.

1949-50 సాలుకు ప॥ గోదావరికి లక్షా 75 వేలు సస్యాభివృద్ధిక్రింద కొత్త నూతులకు ఇవ్వబడెనని, నారాయణరావుగారికి సమాధానముగా రెవెన్యూమంత్రి తెలిపిరి. భాగ్యవంతులకే ఈ గ్రాంట్లు దక్కుచున్నవన్న మాటసహేతుకంగాదనీ కొంత ద్రవ్యం దుర్వినియోగం కావచ్చు గాని 50% అయిన దనటం సత్యదూరమనీ, మంత్రిగారు వివరించిరి. ద్రవ్యం సద్వినియోగమగునట్లు గట్టి పర్యవేక్షణ ఉండగలదనిరి. ఆర్థికస్థితి బాగున్నచో ప్రభుత్వోద్యోగులకు హెచ్చు ధరల అలవెన్సు ఇప్పటికన్న హెచ్చు ఇచ్చుటకు ప్రభుత్వము ఆలోచించును అని మంత్రి గోపాలరెడ్డిగారు సూర్యనారాయణరావుగారికి సమాధానముగా తెలిపిరి.

ప్రయివేటు సంస్థలు లాభమునకు పని చేయును గావున వారు ఇచ్చుకోవచ్చు గాని ప్రభుత్వం ప్రజలకొరకే గావున హెచ్చు ఇవ్వలేదనిరి. ధరలు పెరుగుతున్నమాట నిజమేగాని ఈ విషయమై భారతప్రభుత్వం చర్యతీసుకోవలెననియొక ప్రశ్నకు తెలిపిరి. బస్సు ప్రయాణ ధరలు హెచ్చించినమాట అబద్ధమనిరి. జీవన వ్యయం ఈ రాష్ట్రమునకేగాక అన్ని రాష్ట్రములలోను పెరుగుచున్నందున భారతప్రభుత్వము వారిది బాధ్యత అని మంత్రిగారనిరి. ఈ విషయముయి అర్ధగంట చర్చకు డా॥ జాన్‌గారు అర్థించగా దీనిని గూర్చి అధికముగనే ప్రశ్నలు వేయబడినవనిరి.

## బుడమేరుప్రాజెక్టుపూర్తిఅయినా వరదప్రమాదం తప్పేది గాదుట

### పబ్లిక్‌వర్క్సు మంత్రి భక్తవత్సలంగారి ప్రకటన

మదరాసు, నవంబరు 14: అసెంబ్లీలో పబ్లికువర్క్సుమంత్రి ఎం. భక్తవత్సలంగారు యిట్లుపన్యసించిరి:—

వరదలు నివారించి, జలాధారములను రక్షించవలసిన బాధ్యతగల ప్రభుత్వోద్యోగవర్గమువారు యిటీవలి వరదలకు ఎంతవరకు కారకులన్న విషయం అర్థం చేసుకొనుటకు డెల్టా ఎగువభాగమున ఇరిగేషను చెరువు లెట్లున్నవో చూపుచూస్తే తెలుస్తుంది. ఎగువ చెరువులకు దిగువ చెరువులకు కలుపుకాల్వలున్నాయి. ఎగువ నీటిధికమైన దిగువ చెరువులకు చేరును. ఎగువలోయలందు కొన్నింట యిటువంటి చెరువులు 100 కలవు. అంతాఖరు చెరువులోని నీరు ఏదోనదిలో కలియుచుండును. చెరువులలో నీరు లేనపుడు ఎంతవానపడినా అవినిండే ప్రమాదముండదు. కాని చెరువులు నిండుగా ఉన్నాక తిరిగి వానపడినచో ఎగువదిగువ కలియుటచే వరద ఉపద్రవంగా వచ్చి అన్నికట్లు తెగిపోవును. ఇట్టి ప్రమాదం కొన్ని శతాబ్దులనుండి జరుగుచున్నది.

సెప్టెంబరు వరదలపుడు కృష్ణా గుంటూరు ఎగువ ప్రాంతాల 9 అం. వానపడి చెరువులు నిండినాక, సెలతిరగకుండానే 36 గంటలలో 13 అం. నీరు పడింది. చెరువులు తెగిపోయినవి. గంటకు 80 మైళ్ళ వడితోవచ్చిన గాలి చెరువుల నీరును కెరటాలుగ మార్చివేసి, పై చెరువులు తరువాత దిగువ చెరువులన్నింటి కట్టలు తెగేవరదను కలుగజేసెను. ఇప్పటి వాన నీరేగాక, సెప్టెంబరు నిలువాగూడ కొట్టుకపోయెను.

నూజీవీడు తిరువూరు జమీనులందు 650 జమీను చెరువులలో 300 గండిపడినవి. ఈ చెరువులు మంచిస్థితిలో నున్నచో యింత ఎక్కువ వరద వచ్చేదికాదు. అయినా యింత తుపాను వచ్చినపుడు బాగా సంరక్షింపబడిన మంచి చెరువులు గూడ తెగిపోతాయి. చెరువులు నిండియుండటంమున వెనుకటి తుపానులు యిప్పుడు, తుపాను కలిగించినంత నష్టం కలిగించలేదు.

కనుక యిట్టి ప్రమాదాలకు బాధ్యతి నిర్ణయించునపుడు, యిట్టి మెరకాపల్లపు నేలలందుండు చెరువులకు యిది అనివార్యమగు విపాదమని సభ్యులు గమనించాలి.

#### బుడమేరు స్కీము

బుడమేరు ఎగువప్రాంతాల ఆనకట్ట కట్టుట అవసరమే అని నేను అంగీకరింతును. 1500 లక్షల ఘన అడుగులనీరు నింపే జలాశయము రూ 1 కోటి ఖర్చుతో కట్టుటకు పరిశోధనలు పూర్తి అయినవి. దానివల్ల 10,000 ఎకరాలు సాగగును. కాని యిపుడు మంచిపల్లంపంట పండు చున్న 2400 ఎకరాలు నీటమునిగిపోవును. రామపాదసాగరం కట్టినచో యీ ఆయకట్టు ప్రాంతానికిగూడ లాభించును కనుక యీ ఆలోచనలతో యీ ప్రాజక్టును యింతవరకు ప్రారంభించలేదు.

కాని యీ ప్రాజక్టు నిర్మించినచో యిప్పటివరదలు నిలచియుండెడి వనుకోరాదు. బుడమేరు కొల్లేరులో చేరేలోగా 700 చదరపుమైళ్ల క్యాచిమెంటు ప్రాంతం గలదు. రిజర్వాయరు కట్టేచోట 200 చ. మైళ్ల క్యాచిమెంటుగలదు. రిజర్వాయరు కట్టినా సెప్టెంబరు వానలకే నిండియుండును. తిరిగి తుపానువచ్చేసరికి వరదను నిలుపలేకపోయేది. తుపాను సమయాన 300000 లక్షల ఘన అడుగులనీరు బుడమేరుగుండా ప్రవహించెను. అందు 20 వ వంతుమాత్రం రిజర్వాయరు నిలిపి యుండును.

వానీరు పరుస్సుకు 2000 చ॥ మైళ్ల క్యాచిమెంటు ప్రాంతం గలదు. బుడమేరుప్రాంతం దీనిలో 1/3 వంతే. రిజర్వాయరుకి ఎగువభాగము ఇందు ½ వంతే. కనుక ప్రస్తుతవరదలకంటె వరదలు బుడమేరు రిజర్వాయరు కట్టినా నిలిచేది గావు.

#### అప్పరు డ్రెయిను

బుడమేరు ఎగువభాగం వెడల్పుచేసి, 10,000 ఎకరాలకు నీటిముంపు తగ్గించుటకు స్కీము ప్రత్యేక రివెన్యూసిబ్బంది విచారించుచున్నది. మరింతవిస్తీర్ణము సాగునకు అనుకూలంగా బాగుపడగలదు. కనుక రివెన్యూబోర్డువారి రిపోర్టు రాగానే ఈ పని ప్రారంభింపబడును.

పి. డబ్ల్యు. డి. రివెన్యూశాఖల ఉద్యోగులు గండ్లుపూడ్చుటకు తీవ్రకృషి చేయుచున్నారు. అడివనలు సీఫు ఇంజనీరు స్వయంగా పనిచేయించుచున్నారు.

ఏలూరుకాల్వ 75 చోట్ల తెగినది. అదంతా మరమ్మతుచేయుటకు ప్రత్యేక డివిజను పనిచేయుచున్నది. 1500 మంది కూలీలు నేడు అచట పనిచేయుచున్నారు. ఒకటి రెండు రోజులలో ఈ కాల్వయందు నీరు సక్రమంగా ప్రవహించగలదు. వీలయినంత ఎక్కువసిబ్బందిని ఆ ప్రాంతాలకు అన్నివైపులనుండి తెప్పించి పంపితిమి.

సామర్లకోటకాల్వ మరమ్మత్తు పూర్తి అయినది. కృష్ణ ఆనకట్టు హెడ్‌వర్క్సుకి ఎక్కువనష్టం కలుగకుండుట గొప్పఅదృష్టము. రెండవపంటకు అనుమతియుండుగా వరదలప్రాంతాలకు ఒసంగబడును. గండి పడినచోట రింగుబండు వేసి నీరునిలువ చేసి యుంచుచున్నారు. ఇపుడు పొలంలోనున్న పంటలకు ఈ నీరు ఉపయోగపడును.

జమీందారీ ప్రాంతాలచెరువుల మరమ్మత్తుకి వేరొకడివిజను సిబ్బంది రివెన్యూశాఖవారు తయారుచేయుచున్నారు.

ఆలస్యంలేకుండా మరమ్మత్తులు చేయించుటకు చీఫ్ ఇంజనీరుగారు ప్రభుత్వం మంజూరుచేయకముందే ఖర్చులుపెట్టి పని సాగించుచున్నారు. చేతనైనంత చేయగలమని సభ్యులు నమ్మవచ్చును.

## స్త్రీలపై కమ్యూనిస్టుల దౌర్జన్యం

గుడివాడ, నవంబరు 12: ఈ తాలూకా వెంకటరాఘవపురం కమ్యూనిస్టులు ఇద్దరు తమ ఆచూకీ బయటపెట్టినారనే కోరతో ఆ గ్రామస్థులైన కొకరాల మహాలక్ష్మమ్మను, ఆమె కూతురును, మనుమరాలిని చావమోదిరట. అందుపై ఆ గ్రామ పోలీసుకు రిపోర్టు ఇచ్చిరి. స్వ. వి.

## తెనాలి కమ్యూనిస్టుకు 6 మాసముల కఠినశిక్ష

తెనాలి, నవంబరు 12: స్థానిక సర్కిల్ ఇనస్పెక్టరు సెప్టెంబరు 27 న అరెస్టు చేసిన సంగర వెంకటేశ్వర్లు అను కమ్యూనిస్టుకు 17 (1) క్రిమినల్ లా-ఎమెండు మెంటు యాక్టు ప్రకారం స్పెషల్ మేజస్ట్రేటు 6 మాసముల కఠినశిక్ష విధించిరి.

## కమ్యూనిస్టుకు శిక్ష

చిత్తూరు, నవంబరు 14: ప్రజారక్షణ చట్టంక్రింద ఎ. కె. యజ్ఞనారాయణ యను కమ్యూనిస్టును చిత్తూరు పోలీసువారు 20 దినముల క్రిందట అరెస్టుచేసి రిమాండ్‌లో ఉంచిరి. నిన్న స్థానిక మేజస్ట్రేటు అతనికి 3 మాసముల శిక్ష విధించిరి. అతనిని నేడు అల్లిపురం జైలుకు తీసుకొనిపోయిరి.

### డిటెన్యూల విడుదల

కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపములలోను, రహస్య చర్యలలోను పాల్గొనవని హామీ ఇచ్చిన విశాఖపట్నం జిల్లా కమ్యూనిస్టు శ్రీ గూడెల అప్పలనరసయ్యను విడుదల చేయవలెనని ప్రభుత్వము ఉత్తర్వు చేసినది.

## నెహ్రూకు స్టాలిన్ శుభాకాంక్షలు

### ప్రధానమంత్రి షష్టిపూర్తి ఉత్సవం: ప్రముఖుల సందేశాలు

న్యూఢిల్లీ, నవంబర్ 14: ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ షష్టిపూర్తి మహోత్సవాన్ని పురస్కరించుకుని మార్షల్ స్టాలిన్, ఐర్లాండ్ ప్రధాని డి వలేరా, ఇండొనీషియా అధ్యక్షులు డాక్టరు సోకర్నో అభినందన సందేశాలు అందజేశారు.

"మీకు జన్మదిన సందర్భంలో తమకు నా శుభాకాంక్షలు అందజేయుచున్నాను. స్వీకరింప ప్రార్థన—స్టాలిన్"

"శుభాభినందనములు. భారతప్రజల యోగక్షేమముల కాపాడుటకూ, భారత ఐకమత్యము స్థిరపరచుటకూ, గత చరిత్రలో తాము సాధించిన మహాకార్యముల ఫలితాలు సమృద్ధిగా తాము చూసి ఆనందించుటకూ, తమకు దీర్ఘాయుః ఆరోగ్యములు కలుగుగాక.—డివలేరా"

### డాక్టర్ సోకర్నో సందేశం

"తమకు జన్మదినోత్సవాలు చేసుకునే అలవాటు లేదని నాకు తెలుసు; కాని భారతజాతిలోని 30 కోట్ల ప్రజానీకమూ, ఎంతో ఆనందంతో తమ షష్టిపూర్తి మహోత్సవాన్ని జరుపు కుంటున్నారు. తమకు దీర్ఘాయుః సుఖసౌఖ్యములూ కలగాలని భగవంతుణ్ణి ప్రార్థించుచున్నారు. ఈ సంతోషసమయంలో ఇండొనీషియా ప్రజలుకూడా భారత ప్రజలతోపాటు తమకు చిరాయువు కలగాలని భగవంతుణ్ణి ప్రార్థించుచున్నారు. ఒక్క భారతదేశానికేకాక ఆసియాఖండాని కంతకునూ, మీదు మిక్కిలి యావత్ప్రపంచానికీ చిరకాలం సేవచేసేనిమిత్తం తమకు దీర్ఘాయువు కలగాలని వాంఛించుచున్నారు.

"ఇండొనీషియా ప్రజలతరఫునా, రిపబ్లిక్ తరఫునా, నా తరఫునా ఈ శుభాభివందనాలు అందజేస్తున్నాను."

"తమరూ నేనూ కలుసుకునే శుభదినం ఎప్పుడు కలుసుకుందా? అని ఎదురుచూస్తున్నాను. 'జై హింద్'!—'మెర్‌డికా'—"

### అసఫ్అలీ సందేశం

కటక్, నవంబరు 13: ఒరిస్సా గవర్నరు అసఫ్ అలీగారు పండిత నెహ్రూ జన్మదిన సందర్భంలో ఈ కింది సందేశం పంపించారు.

"ఈ దేశకన్నా ఇంకా సుఖవంతమైన జన్మదినాలు ఎన్నో పండిత నెహ్రూ గడపాలని కోరుతున్న లక్షలాది జనులతో నేనుకూడా కలుస్తున్నాను. ఈ విధంగా కోరటం వ్యక్తిగతంగా ఆయన కోసమే కాక ఆయన ఎవరికోసమయితే చరిత్రను నిర్మిస్తున్నాడో, ఆ కోట్లకొలది ప్రస్తుత ప్రజలకొరకూ, కోట్లకొలది భవిష్యత్ ప్రజలకొరకూ ఈ విధంగా కోరుతున్నాము. ఆయన స్వభావంలో ఏదీ అంటని ఉదాత్తత ఆనేది ఉండటంవల్ల ఆయన మానవజాతి సంతటినీ ఒకటిగా చూడ కలిగి, మానవులకుగల ఉత్తమవాంఛలపట్ల మహాత్తరమైన ఆసక్తి చూపకలిగినాడు. అందువల్లనే ఆయన ప్రాచీన భారతదేశపు ఆధ్యాత్మిక సంపదను, ఆధునిక ప్రపంచపు భౌతిక, వైజ్ఞానికాభివృద్ధులకు జోడించి, మన నూతనజాతికి జీవితవిధానాన్ని సమగ్రంగా ఉండేటట్లు చేయకలిగాడు. వ్యక్తిత్వాన్ని గుర్తించగల అంతర్జాతీయ ప్రముఖులందరు పండిత నెహ్రూ ఈనాడు ఆసియాలోకెల్లా అత్యంత మహనీయ వ్యక్తి అని తలంచారు. మన జీవితముకు అంకితం బలము పాత్రుడయినందుకు మనమంతా గర్వించాలి."

### అస్సాం కాంగ్రెస్ అధ్యక్షుని సందేశం

గౌహతి, నవంబరు 13: అస్సాం రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు దేవేశ్వర్ శర్మగారు పండిత నెహ్రూని జయన 61 వ జన్మదిన సందర్భంలో అభినందిస్తూ, భారతజాతిని, ప్రపంచ మానవకోటిని సేవించేనిమిత్తం ఆయనకు దీర్ఘాయురారోగ్యాలు కలగాలని ఒక సందేశం పంపించారు.

### ఖరక్‌సింగ్ సందేశం

జాతీయ సిక్కునాయకుడు బాబా ఖరక్‌సింగ్ పండిత నెహ్రూ జన్మదినోత్సవ సందర్భంలో పిదప ఒక సందేశాన్నిస్తూ "అల్పసంఖ్యాకులు, ముఖ్యంగా సిక్కులు పాట్సులు పండిత నెహ్రూ చేతులలో సురక్షితంగా ఉంటా"రని ఉద్ఘాటించారు.

"61 వ సంవత్సరంలో అడుగుపెడుతున్న సందర్భంలో నేను పండిత నెహ్రూను అభినందిస్తున్నాను. ఆయన నాయకత్వం క్రింద ఇండియా ఏకచ్ఛత్రంగా పురోగమనం చేస్తుంది" అని యీయన సందేశంలో సూచించారు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ కార్తీక బ॥ ఏకాదశి
1949 సం॥ నవం॥ 16 బుధవారం
బ॥ ఏకాదశి రా 2-15 ఉఫ రా 9-17
శే వర్జ్యం ఉ 7-15 రావ తె 4-54  కు.
బ॥ ద్వాదశి నవం॥ 17 గురువారం
స॥ ద్వాదశి రా 11-14 ౹ సా 7-4 శేవర్జ్యం
ఉ 6 22కు రా వ రా 2-18 ల 3-38 కు.


# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ కార్తీక బ॥ ఏకాదశి
బుధవారం


## ప్రధానమంత్రి సందేశం

"మీరు, నేను అమితముగ ప్రేమించుచున్నట్టి, మనప్రియ భారతదేశము శాంతి, స్వాతంత్ర్యము, మానవసౌఖ్యములసాధనలో ఇతర దేశములకు మార్గము చూపగల జ్యోతివలె, ఉత్సాహము నొసగు చిహ్నమువలె ఇప్పటికైన వర్ధిల్ల గలదని నేను ఆశించుచుంటిని." భారతప్రధానమంత్రి నాలుగువారములు అమెరికా, కెనడా, బ్రిటన్ పర్యటనను ముగించుకొని తమ షష్ట్యబ్దపూర్తిమహోత్సవ శుభ దినమున భారతదేశ సింహద్వారమును ప్రవేశించిన కొద్దిసేపటికి శివాజీనందనవనములో ఏర్పాటైన బ్రహ్మాండమగు బహిరంగసభలో ఉపన్యసించుచు వెల్లడించిన పై భావములు ఆ సేతు శీతాచలము ప్రతిధ్వనించినవనుట అతిశయోక్తి కాదు. దేశ స్వాతంత్ర్య సంపాదనకు, లభించిన స్వాతంత్ర్యమును స్థిరముచేసి భద్రపరచుటకు నిరంతర కృషిచేయు భారతీయులు ప్రతి ఒక్కరు అట్టి ఆశయసిద్ధికే ఎదురు చూచుచుండిరి. పండిట్ నెహ్రూ నాయకత్వముననే ఆమహదాశయ సిద్ధి సాధ్యమని భారతీయులేగాక, ప్రపంచ పౌరులెల్లరు విశ్వసించుచుండిరనుటకు భారత ప్రధానమంత్రి షష్టిపూర్తి మహోత్సవ సమయమున దశదిశలనుండి వచ్చిన శుభసందేశములే నిదర్శనము.

ఆర్థిక స్వాతంత్ర్య సంపాదనకు, రాజకీయ స్వాతంత్ర్యమును సాధనగచేసుకొని, సమతాదర్శముపై స్వతంత్ర భారత రిపబ్లిక్‌ను సుస్థిరముగ పండిట్ నెహ్రూ ప్రతిష్ఠింప కలుగవలెనన్న ఉపప్రధానమంత్రి సర్దార్ వల్లభాయ్‌పటేల్ మొన్నటి రాత్రి వారి రేడియో ప్రసంగమున ఉద్ఘాటించినట్లు ప్రతిఒక్కరు నేడు దేశమునం దేర్పడిన అసాధారణ పరిస్థితిని తొలగించుటకు శాయశక్తుల కృషి చేయవలసియున్నది. పండిట్ నెహ్రూ, తనను అభినందించుటకు బొంబాయిలో ఏర్పాటైన బహిరంగసభలో ఇదే విధముగ భారతీయులకు కర్తవ్యమును బోధించిరి. "మనము బ్రహ్మాండమైన కార్యముల నిర్వహింపవలసియున్నది. అట్టి కార్యములలో మహత్తరమైనది సామాన్య మానవుని జీవనప్రమాణమును వృద్ధిచేయుట. మనము రాజకీయ స్వాతంత్ర్యమును సాధించితిమి. కాని ఆర్థిక స్వాతంత్ర్యమునుకూడ సంపాదింపకున్న ఆ రాజకీయస్వాతంత్ర్యము నిష్ప్రయోజనము. అయితే మనమందరము కలిసి సమష్టిగ కృషిచేసిన ఎన్ని అవరోధము లున్నను,అన్నింటిని అధిగమించి రాజకీయ స్వాతంత్ర్యమును సంపాదించినట్లు ఆర్థిక స్వాతంత్ర్యమును సంపాదింపగలము." ఇదే భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ తన జన్మదిన సందర్భమున భారతప్రజ కివ్వదగిన, ఇచ్చిన అమూల్య సందేశము. ఈ సందేశమును మననము చేసుకొని, అట్టి ఆర్థిక స్వాతంత్ర్య సాధనకు దీక్షాబద్ధులగుటే భారత ప్రజలు తమ ప్రధానమంత్రి కివ్వ తగిన జన్మదిన కానుకలు. పండిట్ నెహ్రూ తమ ప్రసంగమున ఈ విషయమును కూడ స్పష్టము చేసెను. "మానవుని వయస్సు గాదు ప్రధానము. అధికసంఖ్యాకులకు శాశ్వతమైన ప్రయోజనమును నేమకూర్చగల కార్యనిర్వహణశక్తియే ప్రధానము." అని పండిట్ నెహ్రూ ఉద్ఘాటించెను. మన ప్రధానమంత్రి ఇట్టి ఉదాత్త భావములను అన్యుల ప్రయోజనముకొరకు ఉద్ఘాటించుటలేదు. ఆయన జీవితమే ఆదర్శప్రాయమైనది.

భారతదేశము స్వాతంత్ర్యమును పొంది రెండు సంవత్సరములుమాత్రమే అయినను ప్రపంచ రాజకీయములందు ప్రముఖస్థానమును పొందగల్గెను. ఇందుకు గాంధిమహాత్ముడు ప్రబోధించి అమలుచేసిన అహింసా సిద్ధాంతముతోబాటు పండిట్ నెహ్రూ విశాల దృక్పథము, రాజనీతిజ్ఞత కూడ కారణభూతములైనవి. స్వకీయ ప్రతిభవలన మహోన్నత శిఖరములనందుకొనుటేగాక, తన దేశమునకును అగ్రరాజ్యములలో స్థానమును లభింపజేసెను. తన సోదరభారతీయులకు ప్రపంచ రంగమున గౌరవస్థానమును సంపాదించెను. అట్టి చారిత్రక పురుషుడు పండిట్ నెహ్రూ జన్మదినము సర్దార్ వల్లభాయ్‌పటేల్ ప్రకటించినట్లు భారతీయులకు జాతీయ పండుగ, శాంతికాము లందరికి పర్వదినము. అదే రోజున తమ అమెరికాజైత్రయాత్రను ముగించుకొని ప్రధానమంత్రి స్వదేశమునకు తిరిగి వచ్చుట విశేష సంతోషకరమైన సంఘటన. భారత ప్రజానీకము తమ ప్రధానమంత్రి ఆయురారోగ్యములనుకలిగి చిరకాలము వర్ధిల్లవలెనని ప్రార్థనలు జరిపెను. అట్టి ప్రార్థనలు ఫలింపవలెనన్న భారతీయులు పండిత నెహ్రూ సందేశము నాలించి వెంటనే కార్యోన్ముఖులు కావలెను.అపుడే మనశుభాకాంక్షలు సార్థకమగును.

## తుపాన్ బాధితులయెడ ప్రభుత్వ బాధ్యత

కోస్తాజిల్లాలలో తుపానువలన కల్గిన నష్టమునుగురించి ఇప్పటివరకు ప్రచురితములైన వార్తలు అతిశయోక్తులు కావని గతవారము రెవిన్యూబోర్డు సభ్యుని ప్రకటనేగాక, మొన్నటిదినము రాష్ట్రకౌన్సిల్‌లోను, అసెంబ్లీలోను రెవిన్యూమంత్రి చేసిన దీర్ఘ ప్రకటన, ప్రసంగములు స్పష్టము చేయుచున్నవి. సెప్టెంబరుమాసములో వచ్చిన వరదలవలన, అక్టోబరుమాసములో వచ్చిన తుపాను వరదలవలన, ఆంధ్ర జిల్లాలలో దాదాపు 11 లక్షల ఎకరముల పంట ధ్వంసమైనట్లు, మూడులక్షల నివాసములు ఆనవాలు లేకుండ పోయినట్లు, 35 వేల పశువుల నష్టము, సంభవించినట్లు అధికార ప్రకటనే వెల్లడించెను. ఇదిగాక 835 మంది మరణించిరి. నష్టము ఇంత విపరీతముగ నుండగ ప్రభుత్వమువారు రెండు లక్షల నలువది యైదువేల రూపాయిలను మంజూరు చేసి తుపాన్ బాధితుల సహాయ కార్యక్రమమును ప్రారంభించిరి. నష్టము వివరములు తెలియకపూర్వము చేసిన ఈ గ్రాంటు, నష్టవివరములు తెలిసిన అనంతరము, అవసరములకు తగినట్లు మార్పు చెందినదని రెవిన్యూ మంత్రిగారి ప్రసంగము ప్రకటింపలేదు. కనుకనే అసెంబ్లీ, కౌన్సిల్‌లో సభ్యులు ప్రభుత్వము మంజూరు చేయవలసిన గ్రాంటును గురించి సవరణలను ప్రతిపాదింప వలసివచ్చెను.

సహాయకార్యముల యెడ ప్రభుత్వవైఖరి ఇట్లుండ, బుడమేరు ప్రాజెక్టు విషయములో పబ్లిక్ వర్క్సుమంత్రి వెల్లడించిన యభిప్రాయములు విపరీతముగ నున్నవి. బుడమేరు ప్రాజెక్టు ఇతఃపూర్వమె నిర్మాణమైయున్నను అక్టోబరు వరదను అరికట్టుట సాధ్యమయ్యేడిది గాదను వీరివాదము, తిరిగి ప్రాజెక్టు నిర్మాణమును వాయిదా వేయుటకు ఉద్దేశింపబడినట్లుగనె భావింప వలసివచ్చును. ఆంధ్రప్రాంతావసరములపట్ల చెన్నరాష్ట్ర ప్రభుత్వము ప్రదర్శించుచున్న ఈ వైఖరి క్రొత్తగాదు. రామపాదసాగర్ ప్రాజెక్టు ప్రాతిపదిక కార్యకలాపము నిలిపివేయబడలేదని శాసనసభలం దనేకమార్లు ప్రకటించిన పబ్లిక్‌వర్క్సు మంత్రి మొన్నటి దినము రామపాదసాగర్ ప్రాజెక్టు డివిజను రద్దయినట్లు వెల్లడించిరి. ఈ విధముగ, కొంతవరకు చెన్నరాష్ట్ర ప్రభుత్వము ఆంధ్రుల రాష్ట్రవాంఛను దృఢతరము చేసెను. కాని అది భవిష్యత్తుకు సంబంధించినది.

వర్తమానములో రాష్ట్రప్రభుత్వము తన కర్తవ్య, బాధ్యతలను నిష్పాక్షికముగ నిర్వర్తింపలేదనుటకు తుపాన్ బాధితుల సహాయము విషయములో ఇంతవరకు చేసిన పనులు చాలును. రెమిషన్ ఇచ్చు విషయము ఇంకను ఆలోచనలో నున్నట్లు రెవిన్యూ మంత్రిగారు ప్రకటించుట చిత్రముగ నున్నది. ప్రభుత్వప్రతినిధులిచ్చినహామీలు ప్రజలబాధలను తొలగింపజాలవు. రాష్ట్రశాసనసభ ప్రభుత్వమునకు కర్తవ్యమును తెలుపుటేగాక, బాధిత ప్రజానీకమునకు తక్షణము సహాయము జరుగునట్లు చూడవలసియున్నది. ఇది ఆంధ్ర-తమిళ వివాదమునకు లోనగు సమస్య గాదు. ఇది భారత దేశమునకు అంతటికిని సంబంధించిన సమస్య. లక్షలాదిప్రజలకు పునరావాసము కల్పించుట, తిరిగి జీవనోపాధిని కల్గించుట ప్రాంతీయ సమస్య కాజాలదు. రాష్ట్రశాసనసభ నష్టమునకు తగిన పరిహారమును ప్రభుత్వ మివ్వవలెనని తీర్మానించి, ఆ తీర్మానము అమలు జరుగునట్లు కూడ చూడవలసియున్నది. అపుడే సభ్యులు తాము ప్రజాప్రతినిధుల మని భావించుటకైనను అర్హతను పొందినవా రగుదురు.

## స్వతంత్ర ఇండొనీషియాకు అభినందన

### రాజ్యాంగ పరిషత్తులో సిధ్వా ప్రతిపాదన

న్యూఢిల్లీ, నవంబర్ 14: గొప్పసమరం సాగించి స్వాతంత్ర్యం సంపాదించినందుకు ఇండొనీషియా ప్రజలను అభినందిస్తూ రాజ్యాంగ పరిషత్తులో నేడు ఆర్. కె. సిధ్వా ఒకతీర్మానం ప్రతిపాదించి, భారతీయులవలెనే తమ రాజ్యాంగాన్ని తయారుచేసు కొంటున్న ఇండొనీషియా ప్రజలను రాజ్యాంగపరిషత్తు అభినందించడం యుక్తమనీ, ఈ తీర్మానం ఈసభకు ఆమోదకరం కాకపోతే అధ్యక్షుడు తంతి ద్వారా అభినందనలు పంపాలనీ కోరారు.

ఈ తీర్మానాన్ని సారస్య సంఘానికి అందజేసి వారిసలహా తీసుకొంటానని అధ్యక్షుడు రాజేంద్రప్రసాదు అన్నారు.

లోగడ చైనాలో భారత రాయబారిగా పనిచేసిన ఎం.ఆర్. మసానీ నేడు రాజ్యాంగపరిషత్తుకు హాజరైనారు.

# రష్యా "శాంతి" పథకం

## సమితి రాజకీయసంఘంలో విషిన్‌స్కీ ప్రతిపాదన: పశ్చిమరాజ్యాల సమాధానం

లేక్‌సక్సెస్, నవంబరు 14: సోవియట్ రష్యా ప్రతిపాదించిన శాంతిపథకానికి నేడు అమెరికా బ్రిటన్‌లు ప్రత్యుత్తరం ఇచ్చాయి.

సోవియట్‌రష్యా అగ్రరాజ్య పంచకం ఒక శాంతి సమాధానాన్ని ఏర్పాటుచేసుకోవాలని కోరింది. బ్రిటన్, అమెరికాలు అందుకు అన్ని రాజ్యాల సహకారం అవసరం అన్నాయి.

సోవియట్ ప్రతిపాదనకు ప్రత్యుత్తరంగా ఆంగ్లో-అమెరికన్ ప్రతిపాదనను అమెరికన్ ప్రతినిధి వారన్‌ఆస్టిన్ ప్రవేశ పెట్టారు.

ఈ ప్రతిపాదనలు రెండు సమితి తాలూకు రాజకీయ సంఘంలో ప్రవేశ పెట్టబడ్డాయి. ఐక్యరాజ్యసమితి ధర్మప్రణాళికలో ప్రపంచశాంతికి అవసరమైన పునాదులు వున్నాయని, వాటిని అన్ని రాజ్యాలు అరమరికలేకుండా బలపరచడమే లోపంగా కనపడుతున్నదని వారన్ ఆస్టిన్ ఈ ప్రతిపాదనను ప్రవేశపెడుతూ అన్నారు.

ప్రపంచంలో సుస్థిరశాంతికి అవసరమైన ధర్మసూత్రాలన్నీ కూడా ఐక్యరాజ్య ధర్మప్రణాళికలో వున్నాయి. వాటిని అంతా పాలించాలి అని సమితి ఒక ప్రకటన చెయ్యాలని ఈ ఆంగ్లో-అమెరికన్ ప్రతిపాదన కోరుతున్నది.

సోవియట్‌రష్యా తరఫున శాంతిప్రతిపాదనను ప్రతిపాదిస్తూ ఆండ్రే వైషిన్‌స్కీ అమెరికా బ్రిటన్‌లలో జరుగుతున్న యుద్ధ సన్నాహాలను సమితి తీవ్రంగా ఖండించాలని కోరారు.

ఆయన ప్రతిపాదించిన తీర్మానం మూడు భాగాలుగా వుంది.

(1) అగ్రరాజ్యాలు యుద్ధానికి సన్నాహంలో నిమగ్నమై వున్నాయి. అటువంటి వాటిల్లో ముఖ్యంగా బ్రిటన్ అమెరికాలను చేర్చవలసి వుంది. వారిని తీవ్రంగా నిరసించాలి. (2) ఎటువంటి షరతులూ లేకుండా అటంబాంబులను నిషేధించాలి, ఆ తరువాత అణుశక్తి కంట్రోలుకు పరియైన అంతర్జాతీయ నిబంధనలు ఏర్పాటు చేయాలి. (3) ప్రపంచ శాంతిరక్షణార్థం అమెరికా, బ్రిటన్, చైనా, ఫ్రాన్సు రష్యాలమధ్య ఒక ఒప్పందం జరగాలి.

ఈ ప్రతిపాదనమీద మాట్లాడుతూ, ఇంతవరకు సోవియట్‌రష్యా ప్రపంచ శాంతి దోహదంగా చేసిన ప్రతిప్రయత్నాన్ని సమితిలో మెజారిటీలో వున్న ఆంగ్లో అమెరికన్ వర్గాలవారు తూర్పారపట్టారని వైషిన్‌స్కీ అన్నారు. అంతేకాకుండా కోమింటాంగ్, టిటో మురా, మొదలైన సోవియట్ వ్యతిరేకశక్తులను బలపరుస్తూ రష్యాకు వ్యతిరేకంగా ఎడతెగని ప్రచారంచేస్తూ ఆయన ఆరోపించారు. పశ్చిమ జర్మనీలో ఒక ప్రభుత్వాన్ని స్థాపించడం, యాల్టా, పోట్సుడాం ఒడంబడికలకు విరుద్ధంగా నడవడం, వీటితో ఆంగ్లో అమెరికన్‌లు ప్రపంచ శాంతికి నీళ్లు తోడుతున్నారని ఆయన వారిమీద ఆరోపణలు చేశారు.

వైషిన్‌స్కీ అనంతరం వారన్ ఆస్టిన్ ఆంగ్లో-అమెరికన్ ప్రతిపాదనను ప్రవేశపెడుతూ సోవియట్ ప్రతినిధి ఆరోపణలకు ప్రత్యుత్తరం ఇచ్చారు. ఐక్యరాజ్య ధర్మప్రణాళికను అంతా గురించి పాలిస్తే ప్రపంచంలో పొరపొచ్చాలూ వుండవు. అట్లా పాలించక పోవడంచేతనే ఇప్పటి ఈ విపరీత పరిస్థితిలో కొన్ని ఏలుతున్నది అని ఆయన అన్నారు.

గడచిన కొద్ది సంవత్సరాల అనుభవంలోనూ, సోవియట్‌రష్యా అంటే అందరికీ నమ్మకం కలిగిందనీ, ఇందుకు కారణాలకోసం ఎప్పుడో జరిగిన నాజీ జర్మనీతో స్నేహం చేయడం దాకా పోనక్కర లేదని, కొరియా విభజన, బల్గేరియా, హంగరీ, రుమేనియాలలో ప్రతిపక్షాలను నాశనం చేయడం, పోలండును దాస్యంలో ముంచడమేకాక,ఒకరష్యాసేనానిని తీసుకువచ్చి ఆ దేశానికి రక్షణశాఖామంత్రిగా నియమింప జెయ్యడం, ఇవన్నీకూడా సోవియట్ రష్యా ఏవిధంగా నడుస్తున్నదీ వ్యక్తం చేస్తూనేవున్నాయని ఆయన అన్నాడు. పూరికే శాంతి, శాంతి అని అరచినంతమాత్రంచేత ఈ పనులన్నీ కప్పబడిపోవనికూడా ఆయన స్పష్టం చేసారు.

సోవియట్ ప్రతిపాదనను ఆంగ్లో-అమెరికన్ వర్గంవారు వ్యతిరేకిస్తున్నారు. అందుకు కారణం ఇది. రష్యా ప్రపంచశాంతి అగ్రరాజ్యాల చేతుల్లోని విషయం అనుకుంటున్నది. మాకు అట్టి నమ్మకంలేదు. మేము ప్రపంచ రాజ్యాలు అన్నింటికి ఇందులో ప్రమేయం వుండాలంటున్నాం. ప్రపంచ ప్రజాశాంతిని వాంఛిస్తున్నది గాని, పట్టివాగ్దానాలను కోరడంలేదు. చేసుకున్న ఒడంబడికలను పాటించడంలో మాకు నమ్మకంవుందిగాని, వాటిని ప్రచారం నిమిత్తం ఉపయోగించుకోవాలనే బుద్ధిమాకులేదు అంటూ వారన్ ఆస్టెన్ వైషిన్‌స్కీని ఈ విధంగా హెచ్చరించారు.

వైషిన్‌స్కీ చెప్పిన దాంట్లో కొత్త ఏమీలేదు. నాల్గుసంవత్సరాలనుంచీ పాడుతున్న పాటనే ఆయన ఇవ్వాళకూడా పాడారు. ఆయన్ను నేను ఈ విధంగా హెచ్చరించదలచుకున్నాను. కోమిన్‌ఫారం దేశాలంటే మీకు అభిమానంవుండవచ్చు. అందుకని కోమిన్ ఫారంలో లేనిదేశాలను తిట్టవద్దు. కోమిన్ ఫారంతో చేరని ప్రపంచమంతా మీకు విరోధివర్గంలోనిదని భావిస్తున్నారు, అది పొరపాటు. మీ ప్రజలను మా ప్రజలను కలుపుదాం. వారు వీరు కలిసి చర్చించుకుంటారు.మీరు ఇటువంటి చర్చలకు పావకాశం లేకుండా ఒక ఇనుపతెర కప్పుకుకూర్చున్నారు. దాన్ని తొలగించండి. ప్రపంచశాంతికి దోహదం చేసినవారవుతారు.

## మహాత్మునికి యుక్తమైన స్మారకచిహ్నం

### ప్రధాని ప్రసంగం

### ద. ఇం. స్టే. ఇన్సూరెన్సు సొసైటిలో చిత్రపటావిష్కరణ

మదరాసు, నవంబరు 15:—ఎవరి విద్యుక్త ధర్మమును వారు నిర్వర్తించుకుంటూ, దేశసేవయే పరమావధిగా పెట్టుకొని గాంధీజీ బోధనల ననుసరించుటయే వారికి యుక్తమైన స్మారకచిహ్నము. ఫొటోలు, విగ్రహములను పెట్టుట వారిని గౌరవించుటకు గాదు. ఆ రీతిగా వారిని గౌరవించ నవసరమేలేదు. వారి పటము వుంచుకొని మనం గౌరవము పొందుచున్నాము. ఎవరి విధులను వారు నిర్వహించవలెనని ప్రతిక్షణము ఈ పటము జ్ఞాపకము చేస్తూవుండగలదు. మహాత్ముడు అనుసరించిన, ప్రబోధించిన ఆశయముల ప్రేరణకు ప్రతీకముగా వుండగలదని మదరాసు ప్రధాని శ్రీ పూసపాటి కుమారస్వామి రాజా గారు నిన్న సాయంత్రం సౌత్ ఇండియా కో ఆపరేటివు ఇన్సూరెన్సు కంపెనీ భవనములో మహాత్ముని చిత్రపటమును ఆవిష్కరించుచూ చెప్పిరి.

సమావేశమునకు వర్తకులు న్యాయవాదులు, ఇతరులు పలువురు వచ్చిరి. సహకార సంస్థల రిజిస్ట్రార్ శ్రీ జె. సి. రాయన్, శ్రీ యస్. కె యజ్ఞనారాయణ అయ్యర్, భూమి తనఖా బ్యాంకు అధ్యక్షుడు శ్రీ బి. వెంకటరత్నం, శ్రీ యం. సత్యనారాయణ, శ్రీ డి. యస్. శాస్త్రి గార్లు హాజరైరి.

సొసైటీ అధ్యక్షుడు శ్రీ వల్లూరి పార్థసారథిగారు ప్రధానిని ఆహ్వానించిరి.

చిత్రపటావిష్కరణ తరువాత ప్రధాని చిత్రకారుడు శ్రీ డి.సుబ్బరాయశర్మగారికి సంఘమువారిచ్చిన పతకమును బహూకరించిరి.

శ్రీ వేమవరపు వెంకటచలంగారు అభినందనలు తెలిపిరి.

## కంచిమీదుగా తిరుపతికి బస్సు

### 21-వ తేదీనుండి మొదలు

పలువురు యాత్రికులు కోరినందున ప్రభుత్వబస్సులశాఖవారు ఈ 21 వ తేదీనుండి మదరాసునుండి కంజీవరంమీదుగా బస్సులు నడిపించదలచిరి. ఉదయం 6-30 గంటలకు లాకాలేజి పోలీసుస్టేషను వెనుకనుండి బయలుదేరి, రాత్రి 7 గంటలకు తిరిగివచ్చును. దీని నెంబరు 105.

ఈ సర్వీసుకి కాళహస్తినుండి తిరుపతి చంద్రగిరిమీదుగా చిత్తూరుపోవు బస్సుసర్వీసుకలియును. అది 103 నెంబరు

### అనంతపురం ఇంజనీరింగు కాలేజి

అనంతపురం ఇంజనీరింగు కాలేజిలో గాసుప్లాంటు కట్టుటకు ప్రభుత్వమువారు రూ 15,300 ఖర్చు మంజూర్ చేసిరి.

### ఆంధ్ర మెడికలు కాలేజీ

పైకాలేజి పోస్టలు వార్డనులు యిద్దరి నివాసములు కట్టుటకు రూ 62,000 ఖర్చు ప్రభుత్వంవారు మంజూర్ చేసిరి.

### పచ్చయప్ప ట్రస్టీ

పచ్చయప్ప చారిటీసు ట్రస్టుబోర్డు సభ్యులుగ కె.వెంకటస్వామినాయుడుగారి స్థానే సత్రసాల వెంకట్రామను గారు ఎన్నుకోబడిరి.

## చెన్నపట్నం భవిష్యత్తు

### అసెంబ్లీలో ప్రశ్నలు

### నాయకత్రయ నివేదికకు భక్తవత్సలంగారి వ్యాఖ్య

చెన్నపట్నం, నవంబరు 15: తమిళ కాంగ్రెసు కార్యవర్గములోను, తమిళ పరిషత్తులోను మద్రాసు తమిళనాడులోని అంతర్భాగమేనని మద్రాసు పబ్లిక్‌వర్క్సు మంత్రి ఎం. భక్తవత్సలంగారు తెలిపినది వాస్తవమేననియు అది వారి వ్యక్తిగతాభిప్రాయమేననియు ప్రధాని తరఫున సభానాయకులు బెజవాడ గోపాలరెడ్డిగారు నేడు మద్రాసు అసెంబ్లీలో సలాంగారు అడిగిన ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

రజాఖాన్‌గారు: మంత్రివర్గ సమావేశం జరుగనున్నతరి అట్టి వివాదాస్పద సమస్యపై మంత్రిగారు చిత్తమువచ్చినట్లు మాట్లాడవచ్చునా?

శ్రీ భక్తవత్సలంగారు: తాము వ్యక్తీకరించిన అభిప్రాయము నాయకత్రయ నివేదికకు అనుగుణముగనే ఉన్నదనియు, ఆ నివేదికను రాష్ట్రకాంగ్రెసు, ప్రభుత్వము గూడా అంగీకరించినవనియు, చెన్నపట్నాన్ని ప్రత్యేకరాష్ట్రంగా చేయరాదని గత సాలున మద్రాసు ప్రభుత్వం తీర్మానించి ఉన్నదనియు దానిని అనుసరించే తమ ప్రకటన ఉన్నదనియు తెలిపిరి.

శ్రీనివర్తి వెంకటసుబ్బయ్య:- నాయకత్రయ నివేదిక కర్తలలో ఒకరగు రాష్ట్రపతి పట్టాభిసీతారామయ్యగారు చెన్నపట్నం తమిళరాష్ట్ర అంతర్భాగముగా చేర్చరాదనియు చెన్నపట్నం ప్రత్యేకరాష్ట్రముగ నే ఏర్పరచవలెననియు తెలుపలేదా? సమాధానములేదు.

హమీద్‌ఖాన్‌గారు: మంత్రివర్గంలో ఈవిషయమై భిన్నాభిప్రాయం ఉన్నదా?

శ్రీ భక్తవత్సలం: లేదు.

మజీద్‌గారు: ఆంధ్ర మంత్రులు యథేచ్ఛగా మట్లాడుతున్నపుడు తమిళ మంత్రులు మాట్లాడుటలో అభ్యంతర మేమి? సమాధానంలేదు.

రజాఖాన్‌గారు: మంత్రివర్గంలో సంయుక్త బాధ్యత ఉన్నప్పుడు ఏ మంత్రికి తోచినట్లు ఆమంత్రి మాట్లాడినపుడు తాను బాధ్యతను ఉల్లంఘించుచున్నామని తలంచుటలేదా?

శ్రీ భక్తవత్సలం: సంయుక్త బాధ్యత సంగతి మంత్రులకు తెలుసు. అందుకు భిన్నంగా మంత్రులు చేయలేద.

మొహిద్దీన్‌కుట్టిగారు: మళయాళీలకు పట్నంపైగల వాక్కును పరిశీలించినారా?

స: అన్ని దృక్పథాలు విచారించే మంత్రివర్గంవారు తీర్మానం చేసినారు.

రజాఖాన్‌గారు: మంత్రులు మాట్లాడినపుడు వ్యక్తిగతంగా తప్ప మంత్రివర్గ సభ్యులుగా మాటలాడమని హామీ ఇచ్చెదరా?

సమాధానంలేదు.

హమీద్‌ఖాన్‌గారు: మంత్రుల వ్యక్తిగతాభిప్రాయాలు చెప్పరాదని సభానాయకులు చెప్పినపుడు పబ్లిక్ వర్క్సుమంత్రి స్వంత అభిప్రాయము చెప్పవచ్చునా?

శ్రీ భక్తవత్సలం: ఇందు స్వంత అభిప్రాయమేమీలేదు. రాష్ట్ర కాంగ్రెసు సంఘములు, గవర్నమెంటు చెప్పినదేనేను చెప్పినాను.

కాను బ్రహ్మానందరెడ్డిగారు: నాయకత్రయ నివేదిక మద్రాసు తమిళరాష్ట్ర అంతర్భాగమని చెప్పలేదుగదా?

స: మద్రాసుపై ఆంధ్రులు హక్కు వదలుకోవలెనని నాయకత్రయ నివేదిక తెలిపినపుడు, రెండు కాంగ్రెసుసంఘములు దానిని అంగీకరించినపుడు ఈ ప్రభుత్వం గూడా ఆంధ్రదేశ అంతర్భాగముగా చెన్నపట్నం కారాదని చెప్పినపుడు నేనుచెప్పినదే దానిఅర్థము.

శ్రీ తెన్నేటి విశ్వనాథం: భక్తవత్సలంగారు నాయకత్రయ నివేదికకు చెప్పిన అర్థం సరికాదుగదా! తమిళనాడులో చెన్నపట్నం అంతర్భాగం కావలెనని ఆనివేదిక ఎక్కడైనా చెప్పినదా?

స: వ్యాఖ్యానము అనుభవజ్ఞులుచెప్పవలసిన వ్యవహారము.

హమీద్‌ఖాన్‌గారు: సభానాయకుల అభిప్రాయ మేమి ఈ సందర్భమున?

స: నేనీ సందర్భమున ఎట్టి అభిప్రాయమూ చెప్పదలచుకొనలేదు.

సైదాపేటలో కార్పొరేషను హైస్కూలు కట్టుకొనుటకు రూ 58,000 ఋణం ప్రభుత్వంవారు ఒసంగిరి.

## చియాంగ్‌కైషెక్ చుంకింగ్ ప్రయాణం

హైకౌ (ఫార్మోజా) నవంబరు 14:— జాతీయ ప్రభుత్వపు తుది పోరాటస్థానమైన ఫార్మోజాను వదలి జనరలిస్సిమో చియాంగ్‌కైషెక్ ఈ రోజు చుంగ్‌కింగ్ వెళ్లిపోయారు. ఈయన జ్యేష్ఠకుమారుడు చియాంగ్-చిన్ కూడా యీయన జంట వెళ్లారు.

## కమ్యూనిస్టుల నణచుటకు పోలీసు గ్రాంటు

### మొత్తం రు 4½ లక్షలు పైగా మంజూరు

కృష్ణ,ఉభయగోదావరి,గుంటూరుజిల్లాలందు కమ్యూనిస్టు చర్యలనణచుటకు నంది గామలో నొక పోలీసు సబు డివిజను, 6 నెలలవరకు ఒక డిప్యూటీ సూపరింటెండెంటుని అతని దిగువ సిబ్బంది నియమించుటకు, 36 క్రొత్త పోలీసు సర్కిలు స్టేషనులు స్థాపించుటకు మొత్తం 4,50,900 సాలీనా ఖర్చు రూ 4100 ప్రారంభ ఖర్చు ప్రభుత్వంవారు మంజూరు చేసిరి.

ఇదికాక కృష్ణా జిల్లాలో స్పెషలు ఆర్మడు పోలీసులకు తోడ్పడుటకు యెక్కువ పోలీసు సిబ్బందిని నియమించుటకు రూ 39,500 సాలీనా ఖర్చు మంజూరుచేసిరి.

విశాఖజిల్లా (దక్షిణం) సర్కిలు పునర్విభజించుటకు రూ 66600 సాలీనా ఖర్చు మంజూర్ చేసిరి.

మలబార్ స్పెషల్ పోలీసులకు టెంటులకు రూ 1,02,600 ఖర్చు మంజూర్ చేసిరి. ఈఖర్చులన్నింటికి అసెంబ్లీలో సప్లిమెంటరీ డిమాండులు ఆర్థిక మంత్రి గారు కోరెదరు.

## నెహ్రూ పర్యటనపై పార్లమెంటులో ప్రశ్నోత్తరాలు

### సంప్రదింపుల వివరాలు ప్రకటించ అట్లీ నిరాకరణ

లండన్, నవంబర్ 14: భారత ప్రధాని పండిత నెహ్రూ తనతో జరిగిన సంప్రదింపుల వివరాలను వెల్లడించటానికి బ్రిటిష్ ప్రధాని అట్లీ నేడు నిరాకరించాడు. సంప్రదింపుల వివరాలు వెల్లడిస్తూ ఒక ప్రకటన చేస్తారా అని కామన్స్ సభలో లేబర్ సభ్యుడు హ్యూజ్ వేసిన ప్రశ్నకు సమాధానమిస్తూ అట్లీ పై విధంగా నిరాకరించాడు.

నెహ్రూ, రాకపోకల విషయమై అట్లీ ఈ కింది విధంగా సమాధాన మిచ్చాడు. "అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఆహ్వానించటంవల్ల పండిత నెహ్రూ అమెరికాలోనూ, కెనడా ప్రధాని సెంట్ లారెంట్ ఆహ్వానం మీద కెనడాలోనూ పర్యటన చేశాడు. వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడూ కూడా ఆయన ఈ దేశంమీదుగా ప్రయాణం చేయటం జరిగినందువల్ల బ్రిటిష్ ప్రభుత్వం ఆయనకు ఆతిథ్యం ఇవ్వ కలిగింది. నేనూ, నా సహచరులూ ఆయనతో ఉభయదేశాలకూ సంబంధించిన అనేక అంశాలను చర్చించాము. ఆ అంశాలను వెల్లడించటానికి వీలులేదు."

హ్యూజ్:- అమెరికన్ సెనేట్‌లోనూ, కెనడా పార్లమెంటులోనూ ఉపన్యసించినట్లుగా, బ్రిటిష్ పార్లమెంటులో కూడా పండిత నెహ్రూ ఉపన్యసించటానికి అవకాశంలేదా?

అట్లీ:- ఆయన అప్పుడే దేశాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయినాడు.

కర్నల్ డంకన్ (కన్సర్వేటివ్):- నెహ్రూతో మీరు సంప్రదింపులు జరిపినప్పుడు ఆయన హైదరాబాద్‌పై జరిపిన దురాక్రమణను గురించి చర్చించలేదా?

అట్లీ దీనికి సమాధాన మివ్వలేదు.

## ఇండో-చైనాపై ఫ్రెంచి ఆధిపత్యం

### ఉండి తీరవలసిందేనని జనరల్ డిగాల్ వాదం

పారిస్, నవంబరు 14: ఫ్రాన్సు ఇండోచైనాలోవుండి తీరవలసిందే అని జనరల్ డిగాల్ నేడు పత్రికావిలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

ఇండోచైనాలో బావ్‌దాయ్ ప్రభుత్వము అంటూ ఏర్పడింది గనుక, ఆప్రభుత్వాన్ని ఇరుకులో పడవేసేమాట ఒక్కటిగూడా అనడం తన అభిమతంగాదని జనరల్ డిగాలీ ఈ సందర్భంలో వెల్లడిచేశారు.

జనరల్ డిగాలీ ఈ సందర్భంలో పండిట్ నెహ్రూ ఇండోచైనాను గూర్చి మెమొరాండంపంపడాన్ని గూర్చికూడా మాట్లాడుతూ, అటువంటి మెమొరాండం ఆయన పంపినట్లు తాను నమ్మడంలేదని అన్నారు. ఇండోచైనానుంచి ఫ్రాన్సు వైదొలగుతుంది అప్పుడు పండిట్ నెహ్రూ ఉత్తరాన్నుంచి వస్తున్న క్రొత్త సమూహాన్ని ఆపగల్గుతాడా అని డిగాలీ ప్రశ్నించారు.

విశాఖపట్నం ప్యాసింజరు నిన్న 6 గంటలు ఆలశ్యంగా వచ్చింది.

# ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ షష్టిపూర్తి: దేశమంతటా ఉత్సవాలు

## గాంధీ సిద్ధాంతాలపై ప్రపంచ ప్రజ శ్రద్ధ

### బొంబయిసభలో ప్రధాన మంత్రి నెహ్రూ ప్రసంగం

(1-వ పేజీ తరువాయి)

గాంధీ ఆదర్శాలు అవగాహన చేసుకున్నదనీ, ఆకారణంచేత ఇండియా ప్రపంచ సమస్యల పరిష్కారానికి తోడ్పడగలదనీ, ఆదేశాల వారు భావించి ఉండవచ్చును. ఇండియా శాంతంగా స్వాతంత్ర్యం సంపాదించడంవల్ల ప్రపంచశాంతికి బాగా తోడ్పడగలదని పాశ్చాత్యదేశాలు భావిస్తున్నాయని నా అభిప్రాయము.

పండిత నెహ్రూ ఇంకా ఇల్లా అన్నారు. భయవిభ్రాంతమైన ఈ ప్రపంచంలో భారతవాణి శాంతి ప్రవచకావాలంటే మనం అంతా గాంధీ ఆదర్శాలు అనుసరించాలి. మనం శాంతి మార్గాల వల్ల స్వాతంత్ర్యం సంపాదించడంచేత ప్రపంచం అత్యధికంగా మనలను గౌరవిస్తున్నది.

అయితే దేశవిభజన సందర్భంలో జరిగిన మత కలహాలవల్ల మన గౌరవం కొంత వరకు సన్నగిల్లింది. అప్పుడు అతికష్టం మీద దేశంలో మళ్ళీ శాంతపరిస్థితులు స్థాపించగలిగాము. దీనివల్ల మళ్ళీ మన గౌరవం ప్రపంచంలో ఇనుమడించింది.

ప్రపంచం మనలను గాంధీజీ ఆదర్శాలకు వారసులమని భావిస్తున్నది. ఇది ఎంత వరకు నిజమో మనం ఎప్పటికప్పుడు జాగ్రత్తగా పరిశీలించుకుంటూ ఉండాలి."

ఆతరవాత పండిత నెహ్రూ ఇంకా ప్రసంగిస్తూ ప్రపంచంలో క్రమక్రమంగా యుద్ధభయం తగ్గిపోతున్నదనీ, ప్రజలు నిర్మాణాత్మకంగా ప్రవర్తిస్తే యుద్ధభయం పూర్తిగా తొలగిపోగలదనీ అన్నారు. మనకు స్వీయరక్షణకు పెద్దపెద్దసైన్యాలు ఆయుధాలు లేకపోయినా, గాంధీజీ శాంత్యాదర్శం ఉన్నదనీ, అదే ప్రపంచ శాంతిస్థాపనకు తోడ్పడగలదనీ పండిత నెహ్రూ చెప్పారు.

ఆయన ఇంకా మాట్లాడుతూ, భారత దేశం శాంతంగా స్వాతంత్ర్యం సంపాదించడంవల్లనే, ఇంగ్లండు ఇండియాలమధ్య వైమనస్యం పూర్తిగా అంతరించిందనీ, శాంతివాక్యాలు పలుకుతున్నంత మాత్రాన అది పిరికితనమని అర్థంచేసుకోకూడదనీ, గాంధీజీ అహింసతోబాటు మనకు ధైర్యం కూడా బోధించారనీ, ఆయన బోధనలవల్లనే ఆంగ్ల ప్రజలయెడల వైమనస్యం కొంచెమైనా లేకుండా పోయిందనీ అన్నారు.

ఆపిమ్మట పండిత నెహ్రూ ఇంకా మాట్లాడుతూ బుద్ధుడు అభిప్రాయాలను బట్టే మనుష్యులు మారుతూంటారని అన్నాడనీ, గాంధీజీ మనకు మహాదర్శాలు బోధించారనీ, వాటివలననే ఆయన మనలను స్వాతంత్ర్యం వైపు నడిపించుకుపోయారనీ, ఆయన వలననే, ఆత్మగౌరవము స్వాతంత్ర్యము కలిగాయనీ, ప్రపంచ సమస్యా పరిష్కారానికి గాంధీ పంథా తప్ప మరివేరు శరణ్యం లేదనీ అన్నారు.

ఆపిమ్మట పండిత నెహ్రూ ఇంకా ఇలాగ అన్నారు. "మనం ఇంకా మహత్కార్యాలు సాధించవలసి ఉన్నది. మనకు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది గాని ఆర్థిక స్వాతంత్ర్యం ఇంకా రాలేదు. మనం దేశీయ ప్రజల జీవిత ప్రమాణం బాగా హెచ్చించాలి. సామాన్య ప్రజలు సుఖంగా ఉన్నప్పుడే మనకు స్వాతంత్ర్యం వచ్చినట్టు లెక్క. ఈఆర్థిక స్వాతంత్ర్యంకోసమే మనం ప్రపంచం తగాదాలలో చిక్కుకోనకుండా తటస్థంగా ఉన్నాము. ఐతే ఇల్లాగ తటస్థంగా ఉండడానికి వీల్లేదు. మనం ప్రపంచ శాంతికి తోడ్పడాలి. శాంతిగా స్వాతంత్ర్యం సంపాదించినదేశం ఎప్పుడూ మానవాభ్యుదయంకోసం తహతహలాడుతూ ఉంటుంది."

ఆపైన పండిత నెహ్రూ ఇంకా మాట్లాడుతూ ఎప్పుడూ పనిలోపడటంలో మునిగి ఉండటంవల్ల తనకు వార్ధకం వస్తున్నదనే అభిప్రాయమే కలగలేదనీ, జనసామాన్యం క్షేమం కాంక్షిస్తూ, నిరంతరము పని చేస్తూండటమే ప్రధానమనీ, అదేమనస్సుకు నిజమైన ఆనందము, శాంతి చేకూర్పగలదనీ, వయస్సుకు ప్రాధాన్యం లేదనీ అన్నారు.

ఆపిమ్మట తమకు చేసిన సన్మానానికి కృతజ్ఞత తెలియజేస్తూ పండిత నెహ్రూ ఇంకా ఇలాగ అన్నారు.

"మీరు నాయెడల ఎంతో ఆప్యాయత కనబరిచారు."

నాకు చిరకాలం ఆయుర్దాయం ఉండాలని కోరారు. మీ అందరి ఉపన్యాసాలకు ప్రతిఫలంగా నేనేమి ఇవ్వగలను? నాకు ఉన్న ఆయుర్దాయం కొంచెము

## బొంబయిపౌరుల తరపున సువర్ణ మణిమయ అశోకస్తూప బహూకరణ

### వివిధదేశాలనుండి ప్రముఖుల శుభ సందేశములు

నవంబరు 14 భారతప్రధానమంత్రి పండిట్ నెహ్రూ 61 వ జన్మదినం. అదే రోజున పండిట్ నెహ్రూ రెండుమాసములు అమెరికా, కెనడా, బ్రిటన్ దేశాల్లో పర్యటించి, తిరిగి స్వదేశానికి వచ్చారు. బొంబాయి విమానాశ్రయంలో పురప్రముఖులు, వివిధ దేశముల కాన్సల్స్, ప్రజలు ప్రధానమంత్రికి ఘనమైన స్వాగతం ఇచ్చారు. బొంబాయిపౌరుల తరపున దాదాపు 65 వేల రూపాయిలు ఖరీదుచేసే రత్నఖచిత స్వర్ణమయ అశోకస్తూపము పండిట్ నెహ్రూకు ఒసంగబడెను. దేశమంతట, ఇతర దేశాల్లో, నవంబరు 14 న అత్యంతవైభవంగా పండిట్ నెహ్రూ జన్మదినోత్సవాలు జరిగినవి. వివిధ దేశాల ప్రముఖులు శుభాకాంక్షలను పంపినారు. (ఈ సందేశములు, ఆంధ్ర దేశంలో నెహ్రూ జన్మదినోత్సవ వివరములు 2,3 పేజీలలో ప్రకటింపబడినవి.)

### నెహ్రూకు జన్మదిన బహూకృతి

#### సువర్ణమణిమయ అశోక స్తూపం

బొంబాయి, నవంబర్ 14: షష్టిపూర్తి మహోత్సవ సందర్భంలో బొంబాయి ప్రజలు, వజ్రాలు పొదిగిన అశోక స్తంభాన్ని ప్రధాని నెహ్రూకు బహూకరించారు. ఈ బహూకృతిని, బొంబాయి లోని ప్రభుత్వభవనంలో, రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షులూ బొంబాయి మేయరు అయిన యస్. కె. పాటిలు ప్రధానికి అందజేశారు. దీని విలువ మొత్తం రూ. 65,000.

ఈ సందర్భంలో ప్రధాని నెహ్రూ ఇలా అన్నారు:

'ఇంత మొత్తం డబ్బు ఖర్చు చేసి, బొంబాయి ప్రజలు ఇలాంటి బహుమానం యివ్వటం, నాకు యేమి చెయ్యటానికీ తోచకుండా వున్నది ఇది చాలా బరువుగానూ, ఒక చోటినుంచి మరొకచోటికి తేలికగా చేర్చటానికి వీల్లేనిదిగానూ వుంది. పయిగా దీన్ని జాగ్రత్తగా భద్రపరచటం కూడా చాలా కష్టం. దీన్ని యేమి చెయ్యవలసిందీ నిర్ణయించుకునేదాకా ఇక్కడ బొంబాయిలోనే వుంచి వెళ్లడం మంచిదనుకుంటున్నాను.

'దీన్ని వేలంవేసి, ఆ మొత్తాన్ని యే ప్రజాభివృద్ధి కార్యానికైనా వినియోగించితే బాగుంటుంది. లేదా నాకు లోగడ వచ్చిన యితర బహుమతులతోపాటు యే మ్యూజియంకన్నా చేర్చాలి! అన్నారు.

### విమానములో నుండగానే పండితునికి శుభాకాంక్షలు

బొంబాయి, నవంబరు 14: ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూగారి విమానము కెయిరోవద్ద ఈజిప్టు భూభాగముపై నెగురుచుండిన సమయమున వారి షష్టిపూర్తి ఉత్సవ శుభదినమారంభమయ్యెను.

ఉదయం పూట ఆయన చాలాకాలము విశ్రమించుచుండెను. ఫలహారానంతరము కొంతకాలము ఈ తరములు చూచుకొనుట లోను కొంతకాలము గ్రంథపఠనము నందును గడిపెను. తరువాత విమానములో ప్రయాణము చేయుచుండిన వారు ఆయనకు జన్మదిన శుభాకాంక్షలందజేసిరి. పండితుడు వారితో కొంతకాలము ముచ్చటలాడెను. విమానములో నుండగానే అనేక జన్మదిన సందేశములు వైర్లెస్ ద్వారా పండితునికి చేరెను. పండితునికి ఆయురారోగ్యైశ్వర్యములు కోరుచు బెహెరిన్ భారతీయులు పండితునికి ఒక సందేశ మంపిరి. భారత సివిల్ వైమానికశాఖ డైరెక్టర్ జనరలు పండితుని కొక శుభ సందేశమంపెను. ఇవిగాక యింకా అనేక సందేశములు పండితునికి చేరెను.

### పండిత నెహ్రూకు షేక్ అబ్దుల్లా జోహార్లు

న్యూఢిల్లీ, నవంబరు 14: "పండిత నెహ్రూ ఒక్క భారతదేశమునకు జెందిన వాడు మాత్రమే కాదు. యావత్ ప్రపంచమునకు జెందినవాడు. ఇండోనేషియా, ఆఫ్రికా, అమెరికా మున్నగు దేశముల యందలి పీడిత ప్రజానీకము తమ స్వాతంత్ర్యసిద్ధికై పండిత నెహ్రూపై ఆశలు పెట్టుకొనియున్నారు." అని కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లాగారు ఢిల్లీ కాశ్మీరు సంఘ యాజమాన్యమున జరిగిన పండిత నెహ్రూ జన్మదినోత్సవ సభలో నుపన్యసించుచు చెప్పిరి.

విశాలభావము, స్వార్థరహితముగా దేశ సేవచేయు ఉత్సాహము పండితుని అలంకారములని కాశ్మీరు సింహము చెప్పుచు దేశమంతయు మతావేశ భూయిష్టమై యుండిన సమయమున పండితుడు ఆ ప్రవాహములో పడకుండుట ఆయన విశాలభావమునకు నిదర్శనమనిరి. పండితునికి భారతదేశము ఏకము, అఖండము అనియు, ఆయనకు మతవిచక్షణలేదనియు చెప్పిరి. పండితుడు తన సుఖమును విడిచి దేశసేవ చేయుచుండెననిరి. కాశ్మీరులకు పండిత నెహ్రూ రక్తబంధువని, ఆయనమూర్తి కాశ్మీరీలకు ఉత్సాహము కలిగించుచుండెనని, యావజ్జీవము పండితుడు ఏసిద్ధాంతములకై కృషిచేయుచుండెనో ఆ సిద్ధాంతములను నిల్వబెట్టుటకు యిప్పుడు కాశ్మీరీలు పోరాడుచున్నారనిరి. ఎన్ని కష్టములు వచ్చినను లెక్కచేయక కాశ్మీరీలు మతతత్వమును ఈ దేశమునుండి నిర్మూలింప కృతనిశ్చయులై యున్నారనిరి. శత్రువు కాశ్మీరు పైబడినప్పుడు పండిత నెహ్రూ, భారత ప్రభుత్వము ప్రదర్శించిన వైఖరి వారి విశాలభావమునకు మరియొక నిదర్శనమనిరి.

షేక్ అబ్దుల్లా పండిత నెహ్రూ మిత్రుడని, పండిత నెహ్రూ అడుగుజాడలలోనే నడుచుచున్నాడని పాకిస్థాన్ విదేశాంగ మంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లా ఐక్యరాజ్యసమితిలో చెప్పినమాటలను పురస్కరించుకొని పండిత నెహ్రూవంటివాని మిత్రత్వము చేకూరు అర్హత తనకు కలిగినయెడల తానుగర్వించుననీ పండితనెహ్రూ కాశ్మీరీ యనుటగూడ తనకు గర్వకారణముగనున్నదని షేక్ అబ్దుల్లాగారు చెప్పిరి. భారతదేశముయొక్క ప్రస్తుత కష్టములను తొలగించుటలో ప్రతి కాశ్మీరీ పండితునికి తోడ్పడుట పరమధర్మమని షేక్ అబ్దుల్లా చెప్పెను.

ఉపప్రధాని బక్షీగులాం మహమ్మద్ గారితోసహా షేక్ అబ్దుల్లాగారు నేటి సాయంకాలము కాశ్మీరునుండి యిచ్చటికి వచ్చిరి.

మీ సేవలోనే గడపాలని ఉన్నది. మీ రందరు నా 60 వ జన్మదినోత్సవంలో చూపించిన ఆదరాభిమానాలను నా కృతజ్ఞత. మన కందరికీ ప్రియతమమైన ఈ భారతదేశం ప్రపంచవాసు లందరికీ గొప్ప దీపిక కాగలదనీ, మార్గదర్శకం కాగలదనీ తద్వారా దేశాల కన్నింటికీ సుస్థిరశాంతి రాగలదనీ ఆశిస్తున్నాను."

### బొంబయినుండి ప్రయాణం

బొంబాయి, నవంబరు 15: ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఈ వేళ బొంబాయినుంచి ఢిల్లీకి వెళ్లిపోయారు. వీరు బయలుదేరిన ఆ. ఐ. ఎ. ఎఫ్. డకోటా విమానం ఈ ఉదయం గం. 8-15 లకు శాంతాక్రజ్ విమానకేంద్రంలో బయలుదేరింది.

బయలుదేరేముందు, బొంబాయి పోలీసుశాఖవారి సైనిక వందనాలను స్వీకరించారు. ఈ విమానకేంద్రంలో, 'బాల్కన్‌జీబారి'కి చెందిన 500 మంది బాలబాలికలు నెహ్రూను కలుసుకున్నారు. వీరితోపాటు కొంచెంసేపు ముచ్చటించి ప్రధాని వారిని దీవించి పంపారు.

బొంబాయి ప్రధాని బి. జి. ఖేర్ గారూ, దక్షిణమండల సర్వసేనాని రాజేంద్రసింహ్‌జీ గారూ, ఇతర సైనికాధికారులు, బొంబాయి మేయర్ యస్. కె. పాటిల్ గారు, ఈ మొదలైన ప్రముఖులంతా విమానకేంద్రంలో ప్రధానికి వీడ్కోలుచేశారు.

### అలహాబాదులో

అలహాబాదు, నవంబర్ 14: ఆయన జన్మస్థానమైన అలహాబాదులో ఈవేళ ప్రధాని పండిట్ నెహ్రూ షష్టిపూర్తి మహోత్సవం వైభవోపేతంగా చేశారు.

ఈ సందర్భంలో జాతీయపతాకాన్ని ఎగురవేస్తూ పండిట్ గోవిందవల్లభపంత్ ఇలా ప్రసంగించారు.

'ఈ అలహాబాదు నదీగడ్డమీద జన్మించిన పండిట్ నెహ్రూ ఒక్క ఈ రాష్ట్రానికేకాక యావద్భారతానికీ కీర్తి తెచ్చారు. అంతర్జాతీయ రంగంలోకూడ ఆయన ఈ రోజు ఎంతో ప్రధాన పురుషుడుగా పరిగణించబడుతున్నారు. ఆయన ఈ మాతృదేశపు విముక్తికొరకు పోరాడటమేకాక ప్రపంచంలోని పీడిత ప్రజానీకంయొక్క విముక్తికంతకూ పోరాడిన వ్యక్తి. ఆ మహావ్యక్తి మనప్రధానికావటం మన అదృష్టం. భారతభవిష్యత్తుకంతా ఆయనపట్టుకొమ్మ. నెహ్రూ జీవితగాథ సువర్ణాక్షరాలలో వ్రాయబడుతుంది.

### గౌహతీలో

గౌహతి, నవంబర్ 14: గౌహతీలోని కాంగ్రెసు కార్యాలయంలో కాంగ్రెసు కార్యకర్తలు సమావేశమై ఈవేళ ప్రధాని నెహ్రూ షష్టిపూర్తి మహోత్సవం చేశారు.

ఆ సమావేశంలో ప్రధాని నెహ్రూ పట్ల అచంచలవిశ్వాసాన్ని ప్రకటించుచూ తీర్మానించారు.

### ఇండొనీషియా

బటేవియా, నవంబర్ 14: ఇండొనీషియాలోని ఇండియా కౌన్సల్ జనరల్ కార్యాలయంలో ఈ వేళ ప్రధాని నెహ్రూ షష్టిపూర్తి మహోత్సవం, విందులతోనూ వినోదాలతోనూ వైభవంగా జరిపారు. ఈ ఉత్సవాలలో స్థానికంగా వున్న భారతీయులంతా పాల్గొన్నారు. భారతదేశపు వార్తా చిత్రాలుకూడా ప్రదర్శించారు.

"ఇండొనీషియా ప్రజలు తమకు దీర్ఘాయురారోగ్యాలు కలగాలని వాంఛించుచున్నారు." అని కౌన్సల్ జనరల్ నెహ్రూకు షష్టిపూర్తి సందేశం పంపారు.

### మదరాసులో

మదరాసు, నవంబరు 15. మదరాసు నగరంలో నిన్న నెహ్రూ షష్టిపూర్తి ఉత్సవసభలు పలుచోట్ల జరిగినవి. రాజాజీహాలులో కామరాజనాడారు అధ్యక్షతను జరిగిన సభలో చంగల్వరాయను ఎం. భక్తవత్సలం, వేదరత్నంపిళ్ళె మున్నగువారు నెహ్రూని కొనియాడుచు ఉపన్యసించిరి.

లక్ష్మీపురం యువజన సంఘము నందు కె. ఎన్. రామస్వామిశాస్త్రిగారి అధ్యక్షతను జరిగిన సభలో గౌ॥ బి. గోపాలరెడ్డి, న్యాయమూర్తులు గోవిందమీనను, మాక్‌నట్, అల్లాడి కృష్ణస్వామయ్యగార్లు ఉపన్యసించిరి.

డా॥ రాజనుగారు తిరువళిక్కేణి సేవలు పోర్ట్రెయిట్సుగాలరీలో, నెహ్రూ పటమును బహిర్గతము నొనరించిరి. అబ్దుల్ హమీదుఖాను, డా॥ వి. కె. జాను, మనరాను బిమపుగార్లు అచట ఉపన్యసించిరి.

ఛీఫ్ ప్రసిడెన్సీ మేజిస్ట్రేటుకోర్టులో న్యా॥ ఎ. ఎస్. పి. అయ్యరుగారు నెహ్రూపటమును బహిర్గత మొనరించిరి.

పెరంబూరు, పటేలురోడ్డు 72 వ నంబరు గృహములో నూతనముగా స్థాపితమయిన "వెంకటరమణ తెలుగు ప్రాథమిక పాఠశాల"వారు పండిత నెహ్రూ జన్మదినోత్సవము 16 వ తేదీ సాయంత్రం 5 గంటలకు పాఠశాల ఆవరణలో జరిపెదరు. లెజిస్లేటివ్ కౌన్సిలు ప్రెసిడెంటు గౌ॥ శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారు అధ్యక్షత వహించెదరు.

### డీన్ ఎచిసన్ సందేశం

డీన్ ఎచిసన్ పండిత నెహ్రూకు పంపిన జన్మదినోత్సవ సందేశంలో ఇలాగ అన్నారు. "మీరు భారతదేశం సుఖంగా చేరుకునే సమయానికి మీ జన్మదినోత్సవంకూడా వచ్చింది ఈ ఆనందసమయంలో నా హృదయపూర్వకాభినందనాలు స్వీకరించండి! అమెరికాలో మిమ్మల్ని కలుసుకునే అవకాశం కలిగినందుకు నాకు చాలా ఆనందంగా ఉన్నది. నేను త్వరలోనే మళ్ళీ మిమ్మల్ని కలుసుకోగలనని ఆశిస్తున్నాను."

## అమెరికా, కెనడాలలో అఖండ జైత్రయాత్రానంతరం స్వదేశానికి నెహ్రూ రాక: బొంబైలో ఘనస్వాగతం

బొంబాయి, నవంబరు 14: ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అమెరికా పర్యటనం ముగించుకొని ఈవేళ సాయంత్రం ఇక్కడికి వచ్చారు. విమానాశ్రయంవద్ద ప్రధానమంత్రికి అఖండ స్వాగతం ఇవ్వబడింది.

పండితనెహ్రూ ప్రభుత్వ భవనంలోకి రావడంతోనే పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ ఇలాగ అన్నారు. "ఈపర్యటనం నాకు ఎంతో సంతోషం కలిగించింది. అమెరికాలోను, కెనడాలోను, ఇంగ్లండులోను నే నెక్కడికి వెళ్లినా ఎంతో ఆప్యాయంగానూ, మర్యాదగానూ ఆహ్వానించారు.

"భారతదేశానికి తిరిగి వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా వున్నది."

నెహ్రూ ప్రయాణం చేసిన ఎయిర్ ఇండియా విమానం సాయంత్రం 4 25 నిమిషాలకు బొంబాయి విమానాశ్రయం చేరుకుంది. ఈ విమానం పేరు రాజపుట్ ప్రిన్సెస్ దీనిలో 4 ఇంజనులున్నాయి. ఆ విమానం చూచే సరికి ప్రజలలో ఆనంద కలకలం మిన్నుముట్టింది. ప్రజలు పోలీసులను తప్పించుకుని, ముందుకు చొచ్చుకుపోవాలని ప్రయత్నించారు. పోలీసులు జాగ్రత్తగా వారిని అదుపులో ఉంచారు. విమానం ఆగగానే 'పండిత నెహ్రూకు జై' 'నెహ్రూ చిరకాలం జీవించుగాక' అనే నినాదాలు మిన్నుముట్టాయి.

ఆరోగ్యశాఖాధికారుల పరీక్ష జరిగిన పదినిమిషాలలో పండిత నెహ్రూ విమానంలోనుంచి యివతలికి వచ్చారు. పండిత నెహ్రూ తెల్లని లాగు, తెల్లని రంగు పొడుగు కోటు, వేసుకున్నారు. శిరస్సుమీద గాంధీటోపీ పెట్టుకున్నారు. పండిత నెహ్రూ సమస్కారంతో ప్రజానీకం జయజయ ధ్వానాలు అందుకున్నారు, ప్రజానీకం జయజయ ధ్వానాలు చేసినప్పుడు, నెహ్రూ కొన్నినిమిషాల పాటు విమాన ద్వారంలో నిలబడ్డారు, ఆ సమయంలోనే చాలా మంది నెహ్రూ ఛాయాచిత్రాలు తీశారు.

బొంబాయి గవర్నరు, సర్ మహారాజ సింగ్, ప్రధాన మంత్రి బి. జి. ఖేర్ లెప్టినెంట్ జనరల్ రాజేంద్ర సింహజీ ప్రభృతులు ఆయనకు విమానాశ్రయం వద్ద స్వాగతం ఇచ్చారు.

విదేశశాఖా ప్రధాన కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయ్, ఇందిరా గాంధీలు పండిత నెహ్రూతో కూడా ప్రయాణించి బొంబాయి వచ్చారు.

పండిత నెహ్రూ 10 అడుగులు నడిచిన తర్వాత సైనికవందనం స్వీకరించారు, ఆ పిమ్మట ఒక సిక్కుపటాలం జనగణ మన గీతం బాండుమీద వాయించింది. 17 వ సిక్కుపటాలం పండిత నెహ్రూకు సైనిక గౌరవం చేసింది.

విమానాశ్రయంవద్ద నానాదేశ రాయబారులు ఆయనకు తమతమ దేశాల జన్మదినాభినందనాలు అందజేశారు. బొంబాయిలో అమెరికా రాయబారిగా ఉన్న సి. హెచ్. టి. బర్లేక్ పండిత నెహ్రూకు అమెరికా ప్రముఖ్య కార్యదర్శి డీన్ ఆచిసన్ పంపిన జన్మదినోత్సవ సందేశం అందిచ్చారు.

అధికార స్వాగతం అయినతర్వాత నెహ్రూ ప్రజాసామాన్యానికి 'నమస్తే' చెప్పారు.

అపిమ్మట పండిత నెహ్రూ బొంబాయి గవర్నరుతోనూ, బొంబాయి ప్రధానితోనూ, కలిసి ఎర్రని కారులో ప్రభుత్వ భవనానికి వెళ్ళారు. దారిలో ఆయన కారులో నిలబడి ముకుళిత హస్తాలతో 17 మైళ్ల పొడుగునా బారులు దీర్చి నిలబడిన ప్రజాసామాన్యం అభినందనాలు స్వీకరించారు.

### "రెడ్‌వుడ్" మొక్క

ప్రధాని నెహ్రూ కెనడానుంచి 'రెడ్‌వుడ్' మొక్క నొకదాన్ని తీసుకు వచ్చారు. ఇది 3 అడుగుల ఎత్తుంది. అంతదూరం నుంచి ప్రయాణంలో వచ్చినా మొక్క చాలా నేవళంగావుంది. ప్రపంచంలోని అన్ని వృక్షజాతుల్లోనూ, ఇంత ఎత్తు పెరిగే చెట్టు మరొకటిలేదు.

బ్రిటిష్ కొలంబియా ప్రజలూ, కెనేడియన్ క్లబ్ వారూ, వాన్‌కూవర్ ప్రధానీ ఈ మొక్కను బహూకరించినట్టు ఆ మొక్కపాతివున్న కుంపటి మీద వ్రాశారు.

శాన్‌ఫ్రాన్సిస్కోనుంచి, వాన్‌కోవర్ వెడుతూ నవంబర్ 9 తే నెహ్రూ మధ్య మార్గంలో ఆర్ మూర్ నేషనల్ పార్కును చూచారు. అది ఈ 'రెడ్‌వుడ్' చెట్లతో నిండిన ఉద్యానవనమే. ఈ చెట్లు చాలా శోభాయమానంగా వుంటయ్.

## ప.గో. జిల్లాలో గవర్నర్ పర్యటన

ఏలూరు, నవంబరు 15: పశ్చిమగోదావరిజిల్లాలోని తుఫానుబాధిత ప్రాంతాలలో మదరాసు గవర్నరుగారు డిసెంబరు 11, 12 తేదీలలో పర్యటిస్తారని నేడిక్కడ తెలియవచ్చింది.

### కీ! శే! పచ్చిపులుసు సుబ్బయ్యగారు

ఏలూరు, నవంబరు 14: స్థానికవర్తక ప్రముఖులలో ఒకరగు శ్రీ పచ్చిపులుసు సుబ్బయ్యగారు 12 వ తేదీ సాయంత్రం గుండెజబ్బుతో అకస్మికముగ మరణించిరి వారి మరణమునకు, వారి ఇద్దరు కుమారులు భార్యతోపాటు అనేకమంది బంధువులు మిత్రులు విచారించుచున్నారు, శ్రీ సుబ్బయ్యగారు అనేక దానధర్మములు చేసిరి.

## సర్దార్ పటేల్ ఉద్బోధ

(1-వ పేజీ తరువాయి)

కల్పించి సభ్యమైన జీవితోపాయము చూపడానికి వీలయ్యేది. అభాగ్యులైన ఈ కాందిశీకులు ఎట్టి కుత్సిత దారిద్ర్యంలో రోజులు వెళ్ళదీస్తున్నదీ మనస్ఫూర్తిగా కడుపు కొట్టుకోలేక పోతోంది.

భారతదేశపు సంస్కృతి అనీ నాగరికత అనీ, పొద్దస్తమానం చెప్పుకోవడం మనకు అలవాటైపోయింది. ఇరుగు పొరుగు సాయం చేసుకోవడం, పేదవారికి ధర్మం చెయ్యడం ఈ ప్రధాన నాగరిక లక్షణాలు మనలో నేడు లోపించినవి. ఎవరివాడినోట కరకాయ కొట్టి, ఎప్పుడూ తన కార్యోగ్యం తన కాయుస్సు అని కోరుకుంటూ ఉండేవారిని ప్రభుత్వానికిచ్చే ప్రతి ధాన్యపుగింజకు దాపెట్టు రక్తం ఇమ్మన్ని కోరించే రక్తపిపాసులను పట్టి దండించవద్దా? మనకు లాభించినప్పుడే గాంధీజీ పేరును జపించడం, లాభించనప్పుడు నిరాదరించడం సంస్కృతి లక్షణమేనా? కాబట్టి కర్షకులకు నావినది ఏమంటే, మీరు ఒళ్లు వంచి పని చేయండి మీకు మీ స్వంత వినియోగానికి సరిగా ఎంత అవసరమో అంత మిగుల్చుకొని తక్కినదంతా ప్రభుత్వానికి అప్పచెప్పండి.

కర్షకుల తర్వాత పారిశ్రామికులకు వ్యాపారస్థులకు కూడా నేను చేయవలసిన విజ్ఞప్తి ఒకటి ఉన్నది. ప్రస్తుత ఆర్థికదుస్థితిని తరించడానికి అధికోత్పత్తి ఒక్కటే సరియైన సాధనోపాయం అని నేను ఇక్కడ మళ్ళీ ఉద్ఘాటించనవసరంలేదు. 12, 13వ తేదీలలో జరిగిన పారిశ్రామిక సలహాదాయిసంఘ సమావేశంలో, పారిశ్రామికులయు, వ్యాపారస్థులయు కార్మికులయు ప్రతినిధులు ఈ విషయమును కూలంకషంగా సహృదయతతో చర్చించి కొన్ని నిర్ణయాలు చేసిరి. ఈ పరస్పర సహకారం చాలా శుభాదర్శమైన సూచన అని నేను భావిస్తున్నాను. ఇప్పుడు దేశం ఒక మహాపదలో ఉన్నదని, యావజ్జాతికి విపత్స్థితి ఏర్పడింది. ఈ స్థితిలో ప్రభుత్వము పారిశ్రామికులు కార్మికులూ అందరు తమ తమ బాధ్యతలను గుర్తెరిగి సమస్యా పరిష్కారానికి సర్వశక్తులా పాటుపడాలి. దేశానికి దేశమే ఆర్థికంగా కుంగిపోతే, దేశంలో ఇక బాగుపడేది ఎవరు? పారిశ్రామికులు బాముకొనేది ఏమిటి? దేశం బాగుపడితే, నష్టపోయేవారు ఎవరైనా ఉంటారా? ఈ ధోరణిలో ప్రతిఒక్కరు ఆలోచించాలి.

పెట్టుబడిపెట్టగలవారికి నేనుచేసే విజ్ఞప్తి ఏమంటే, మీరు దేశసేవచేయడానికి ఇంతకన్న మంచి అవకాశం దొరకదు. దూబరాగా ఖర్చుచేయడం భారతజాతి లక్షణంకాదు. పొదుపరితనం మనరక్తంలోఉన్నది. దేశంలో ఉన్న ప్రతివ్యక్తి తృణమో పణమో తనకు చేతనైనంతా పొదుపుచేసి అభివృద్ధి పథకాలనిర్వహణకింద వినియోగించడానికి ప్రభుత్వానికి అప్పు ఇవ్వాలి. ఈ పథకాలకు ఎక్కువకాలం అడుగునపడేసి ఉంచడం సాధ్యంకాదు.

### శ్రీ స్వామీ ప్రసన్నానందగురు

మద్రాసు, నవంబరు 15: శ్రీ స్వామీ ప్రసన్నానందగురుగారు (తిరుప్పూరు) ఈనెల 19 వ తేదీనుండి వచ్చే జనవరి 6-వ తేదీవరకు చిత్తూరుజిల్లా, కాళహస్తిలో వైశద్య తపస్సు చేసెదరు.

## గాంధీజీ హంతకుల ఉరి

(1-వ పేజీ తరువాయి)

నిరాకరించెను.

ఉరితీయుటను సమయమున పత్రికల తరపున ఎవరైననుగాని, బయటి ప్రజా ప్రముఖులెవరైనను గాని అచటికి రానీయబడలేదు. కొందరు ప్రభుత్వాధికారులు మాత్రమే అచట హాజరైరి.

నేడు జెయిలు అధికారులే రెండు మృతశరీరములకు అంత్యక్రియలు జరిపిరి.

# రంగాగారి జన్మదినోత్సవాలు

## రాష్ట్రంలో పలుచోట్ల సభలు ఊరేగింపులు

### జగ్గయ్యపేట

ఈ గ్రామమున జగ్గయ్యపేట రైతుకాంగ్రెస్, గ్రామ కాంగ్రెస్, చేనేత కాంగ్రెస్ వారి యాజమాన్యమున "గాంధీ ఘాటులో" శ్రీ గంటేల నారాయణరావుగారి అధ్యక్షతన శ్రీ ఆచార్య రంగాగారి జన్మదినోత్సవము జరిగినది. శ్రీ ఘాలి పాళ్ళ వెంకటేశ్వర్లు, సా॥ రామకృష్ణయ్య డా॥ రాయప్రాడి మురహరి కట్టగూరి రామారావుగార్లు వారి జీవిత చరిత్రను గురించి ఉపన్యసించిరి. తాలూకా రైతు కాంగ్రెస్ కార్యనిర్వాహక సభ్యులు కట్టమూరి రామారావుగారి వందన సమర్పణముతో సభ ముగిసినది.

### హుసేను నగరం

హుసేను నగరములో ఆచార్య రంగాజీ 50వ జన్మదినోత్సవము వైభవముగా జరుపబడెను. సభకు శ్రీ నేల్పూరి వెంకట నరసింహారావుగారు అధ్యక్షత వహించిరి. శ్రీ నల్రావుల నరసింహారావుగారు (గ్రామ కాంగ్రెసు అధ్యక్షులు) రంగాగారి జీవితమును గురించి ఉపన్యసించిరి. రైతుకూలీ ప్రజానీకమునకు సేవజేయుటకు రంగాగారికి శతాయువు ప్రసాదించ వలయునని దైవమును ప్రార్థించిరి. తివ్వా సుబ్బారావుగారి వందన సమర్పణతో సభ ముగిసినది.

### ఎలమర్రు

ఎలమర్రులో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు రంగాగారి జన్మదినోత్సవము అత్యుత్సాహంగా జరుపబడింది. ఉత్సవ సందర్భంగా యేర్పాటు చేయబడిన సభకు శ్రీ గద్దె లింగయ్యగారు అధ్యక్షత వహించారు. అధ్యక్షులు శ్రీ రంగాగారి జీవితంలోని ప్రధాన ఘట్టాలను వర్ణించి ఆంధ్ర ప్రజలకు ముఖ్యంగా రైతాంగానికి వారు చేసిన సేవను విశదీకరించారు. శ్రీ కొల్లా సూరు సుబ్బారావు, శ్రీ గద్దె ముత్యాలు గారలు కూడ శ్రీ రంగాగారి దేశసేవ నుగ్గడించిరి.

### గురజాల

7-11-49 తేదీన ఆచార్య రంగాజీ జన్మదినోత్సవము జరుపబడెను. ఆదిమవాసుల సేవాసంఘ సభ్యులు జిల్లాబోర్డు సభ్యులు, ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీ కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు శ్రీ కావూరి వెంకయ్యగారు రంగాజీ జీవిత చరిత్రను గురించి రైతుకూలీలకు చేస్తూవున్న సేవను గురించి వుపన్యసించిరి. ఆచార్య రంగాగారికి భగవంతుడు ఆయురారోగ్య సంపదలిచ్చుగాక యని భగవంతుని ప్రార్థిస్తూ తీర్మానించిరి.

### గుంటూరు

గుంటూరు జిల్లా విద్యార్థి కాంగ్రెసు ఆధ్వర్యాన గుంటూరు కొత్తపేటలో శ్రీ కొమ్మినేని వెంకటేశ్వర్లు [జి. వి. కాం. అధ్యక్షులు] అధ్యక్షతన రంగాజయంతి సభ జరిగింది. సభలో శ్రీ యన్. వీరాచారి, బండ్లమూడి శివరామకృష్ణ, శ్రీ ఆర్. రామసుబ్బారెడ్డి గార్లు ఆచార్యరంగా జీవితంలోని వివిధ ఘట్టాలను వివరిస్తూ ఉపన్యసించారు. సభకు శ్రీ వాసిరెడ్డి వెంకయ్య (కర్షక సంపాదకులు) కూడా హాజరయ్యారు.

### గుడివాడ

7-11-49 తేది సాయంత్రం గుడివాడ కిసాను కాంగ్రెసు ఆఫీసువద్ద గుడివాడ తాలూకా కిసాను కాంగ్రెసు కమిటీ ఆధ్వర్యమున రంగాజీ 50వ జన్మదినోత్సవం దిగ్విజయంగా జరుపబడింది. షుమారు 2 వేల ప్రజలు వచ్చారు. కృష్ణా జిల్లాబోర్డు సభ్యులు శ్రీ అద్దేపల్లి సత్యనారాయణ... రాఘవేశ్వరరావుగారు పరిసర గ్రామాల నుండి మేలురకపు 50 జతల యెడ్లను తెప్పించి ఊరేగింపుకు తోడ్పడ్డారు. రంగాజీకి యీ జయంత్యుత్సవ సందర్భమున రైతుకూలీ ప్రజల తరపున భగవంతుడు సంపూర్ణాయురారోగ్యముల నొసంగవలెనని శుభాకాంక్షలు తెల్పుతూ ఈ తీర్మానించుటైనది.

## ఏలూరులో ఇన్ఫార్మల్ రేషనింగ్

ఏలూరు, నవంబరు 13: ఈ పట్టణ ప్రజలకు అందరికీ సమానంగా బియ్యం పంపకం చేసేందుకు అధికారులు ఇన్ఫార్మల్ రేషనింగును ప్రవేశపెట్టారు. పాత రిజిస్టర్ల ప్రకారమే, అవసరమైన మార్పులు చేసి, పాఠశాల ఉపాధ్యాయుల సహాయంతో రేషన్ కార్డులను తయారుచేసి ప్రజలకిస్తున్నారు. బియ్యంకి పోలు ఈ కార్డులనిచ్చినమాత్రమే బియ్యం ఇవ్వాలని ఆదేశింపబడింది. పంచదారను కూడా ముందు ముందు ఈ కార్డులనిచ్చినచే ఇస్తారట. ఇతర తాలూకాలనుంచి బియ్యం తెప్పించారుకాని జనం ఇంకా పొడుగాటి వరసల్లో చాలసేపు నిలబడితేనే గాని బియ్యం దొరకటంలేదు. (స్వ. వి.)

# కాశ్మీర్ ప్రజల పోరాటం

## ద్విజాతిసిద్ధాంతానికి సవాలని దివాకర్ ఉద్ఘాటన

షోలాపూర్, నవంబరు 13: "తమ మాతృదేశ గౌరవరక్షణకై కాశ్మీరు హిందువులును, ముస్లిములును కలిసి సాగించుచున్న పోరాటము ద్విజాతి సిద్ధాంతమునకు అనగా హిందువులును మహమ్మదీయులును వేరు వేరు జాతులకు చెందియున్నారను సిద్ధాంతమునకు సవాలు. హిందువులును మహమ్మదీయులును ఒకే జాతిలో సభ్యులుగా జీవింపగలరని కాశ్మీర్ ప్రజలు ప్రపంచమునకు నిరూపింప కృతనిశ్చయులై యున్నారు" అని ఇండియా ప్రభుత్వ ప్రచార, శాఖసభ్యుడు శ్రీ ఆర్. ఆర్. దివాకర్ గారు నేటి సాయంకాలము షోలాపూరు నగర కాంగ్రెస్ సంఘ యాజమాన్యమున జరిగిన మహాసభలో నుపన్యసించుచు చెప్పిరి.

కాశ్మీరులో స్వాతంత్ర్య పోరాటమునందు నిమగ్నులై యున్న సైనికులు యుద్ధరంగములో తమ విధులను చక్కగా నిర్వర్తించుట మాత్రమేగాక గ్రామస్థుల కష్టములను తొలగించుచున్నారని, వారు ప్రశాంతజీవితము నెరపుటకు సహాయభూతులగుచున్నారని శ్రీ దివాకర్ గారు చెప్పిరి.

### ఆహారోత్పత్తి కృషి

ఆహార పరిస్థితులను మంత్రి సింహావలోకనము గావించి ప్రభుత్వమువారి అధిక ఆహారోత్పత్తి కృషికి ప్రజలు సంపూర్ణముగా తోడ్పడవలెనని కోరిరి. ప్రజలచేత వారమున కొకపూట అన్నము మాన్పించుటకై జరుగుచున్న కృషి చాలా అర్థవంతమైనదని మంత్రి చెప్పుచు రేషన్ కార్డులలో నిర్దేశింపబడిన ధాన్యముకంటె ప్రజలు కొంచెము తక్కువ పుచ్చుకొనవలెనని కోరుటయే ఈ ఉద్యమోద్దేశ్యమనిరి. ప్రజలు సంపూర్ణముగా తోడ్పడుటయు, ఆహార విషయమున దేశమును స్వయం సమృద్ధము గావింప ప్రజలు కృతనిశ్చయులై యుండుటయు ప్రస్తుతము అవసరమనిరి.

నేటి మధ్యాహ్నము కారులో బిజపూరునుండి యిచ్చటికి విచ్చేసిన శ్రీ దివాకర్ గారు రాత్రి మెయిలులో బొంబాయికి వెళ్లిరి.

## అఖిలభారత శాస్త్రవిజ్ఞాన పరిషత్

న్యూఢిల్లీ, నవంబరు 13: అఖిలభారత శాస్త్రవిజ్ఞాన పరిషత్ 37 వ వార్షిక సమావేశం 1950 జనవరి 3 వ తేదీనుంచి 8 వ తేదీవరకూ పూనాలో జరుగుతుంది. ఈ మహాసభలకు, ప్రొఫెసర్ మహలానోబిస్ అధ్యక్షత వహించగలరని తెలుస్తున్నది.

అన్ని శాస్త్రవిజ్ఞానశాఖలకూ సరియైన ప్రాతినిధ్యం లభించేటందుకు అనువుగా కార్యవర్గంవారు సమగ్రమైన కార్యక్రమ ప్రణాళికను తయారుచేశారు. భారత దేశంలో వున్న వివిధ ప్రాంతాల ప్రముఖులు సమావేశంలో పాల్గొంటారు.

బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, సోవియట్ రష్యాలనుంచి అనేకమంది సుప్రసిద్ధశాస్త్రవిజ్ఞాన పారంగతులు ఆహూతులై సమావేశానికి వస్తున్నారు.

లండను విశ్వవిద్యాలయం బెర్క్ బెక్ కళాశాల ప్రొఫెసర్ డెస్మాండ్ బెర్నల్, రాయల్ సొసైటీ అధ్యక్షుడు రాబిన్సన్, రాబిన్సన్ సతి, అటం పరిశోధనాదక్షులు ప్రొఫెసర్ జోలియట్ క్యూరీ, మాడంజోలియట్ క్యూరీ, పాలినుర్ రసాయనశాఖ అధికారి ప్రొఫెసర్ హెర్మన్ మార్క్, డాక్టర్ ఇ. యు. కాండన్ (విల్లింగ్టన్), ఈ మొదలైన ప్రముఖులంతా వస్తున్నారు. రష్యానుంచి పావ్లావ్ శరీరశాస్త్ర పరిశోధనా కేంద్ర తాలూకు ప్రొఫెసర్ వర్షి యు. ఎ. ఎన్గెల్ హర్డట్ కూడా హాజరవుతారని తెలుస్తున్నది.

## ఇస్లాం రాజ్యాలసభ

### ఆఫ్ఘనిస్థాన్ సమ్మతి

కరాచీ, నవంబరు 14: అంతర్జాతీయ ఇస్లాం రాజ్యాలసభకు హాజరగుటకు ఆఫ్ఘనిస్థాను ప్రభుత్వం అంగీకరించినదని ఇచట అధికార కీలక తెలిసింది. ఈ మహమ్మదీయ రాజ్యాలను సభను హుస్సేను మాలిక్ గారు సమావేశపరచుచున్నారు. అగఖాను గారు తమ ఆరోగ్యం బాగానుంటే సభకు తప్పకుండా హాజరు అవుతానన్నారు. కరాచీలో ఉన్నటువంటి అగాఖానుగారి సచివమండలిని యీసభకు కావలసిన సహాయమంతయూ చేయవలసినదిగా అగాఖాను గారు ఉత్తరువు చేసిరి.

మాల్దీవుల ప్రభుత్వము పూర్తిగా మహమ్మదీయుల ప్రభుత్వమై యున్నది. ఈ మాల్దీవు ప్రభుత్వముకూడా యీ అంతర్జాతీయ మహమ్మదీయ రాజ్యాల సభకు హాజరగుటకును యీసభలోను ప్రవర్తనములోను పాల్గొనుటకును అంగీకరించెను. మాల్దీవుల ప్రభుత్వ ప్రధాన మంత్రికికూడా ఒక ఆహ్వానం పంపబడెను.

# రాష్ట్రాల్లో ఎక్కువ పత్తి ఉత్పత్తి

## వ్యవసాయ మంత్రుల సభా నిర్ణయం

బొంబాయి, నవంబరు 13: ఇక్కడ సమావేశమయిన రాష్ట్రీయ వ్యవసాయ మంత్రుల సమావేశంలో ఈ వేళ అత్యవసరంగా కావలసిన కొన్నిరకాల పత్తి ఎక్కువగా ఉత్పత్తి చెయ్యాలని నిర్ణయించారు. దీనినిబట్టి ముందు సంవత్సరానికి 5 లక్షల బేళ్ళ పత్తి ఎక్కువగా ఉత్పత్తి కాగలదని తెలుస్తున్నది. ఈ సమావేశంలో ఆయా రాష్ట్రాలు ముందు పత్తి ఎంత ఎక్కువగా ఉత్పత్తి చెయ్యాలో కూడా నిర్ణయించారు. పొడుగు పింజ పత్తికూడా ఎక్కువగా ఉత్పత్తి చెయ్యాలని ఈ సమావేశంలో నిర్ణయించాలి. ఈ పత్తి ఇంతకు పూర్వం యుగాండా, ఈజిప్టు, కాలిఫోర్నియాలనించి దిగుమతీ చేసేవారు. అయితే ఇండియాలోనే ఈ రకాలు ఉత్పత్తి చెయ్యడంవల్ల ఈ దేశంలో ఈ రకాల పత్తి విరివిగా దొరకగలదని తెలుస్తున్నది.

## రాష్ట్రీయ మంత్రులకు శ్రీజయరామ్ దాస్ ఉద్బోధ

బొంబాయి, నవంబరు 12: "వ్యవసాయోత్పత్తిని సమన్వయము చేయు పథకము అత్యావశ్యకము. ఈ పథకము ఒక్క ఆహారపదార్థములకు మాత్రమే సంబంధించినదిగా నుండరాదు. ప్రత్తి, జనుము, నూనెగింజలు మున్నగువానికి గూడ అది సంబంధించి యుండవలెను. పౌండు విలువను, రూపాయి విలువను యిటీవల తగ్గించుటచేత ఈ విషయమునకు ప్రత్యేక ప్రాముఖ్య మేర్పడినది. దీనిని వెంటనే పరిష్కరింపవలెను" అని ప్రత్తి పండించు రాష్ట్రముల, సంస్థానముల ఆహారశాఖ మంత్రుల సభలో నుపన్యసించుచు భారత ప్రభుత్వ ఆహారశాఖమంత్రి శ్రీ జయరామ్ దాస్ దౌలత్ రామ్ గారు చెప్పిరి.

భారతదేశమునకు ఆర్థిక స్థిరత్వ మేర్పడవలసినయెడల శాస్త్రీయములగు పద్ధతుల ననుసరించి ఆహారధాన్యములను, ప్రత్తి, జనుము, నూనెగింజలు మున్నగువానిని ఉత్పత్తి చేయవలెనని దౌలత్ రామ్ గారనిరి. ప్రత్తి విషయమై మంత్రి ప్రస్తావించుచు యిప్పుడు యితర దేశములలో ఒక ఎకరములో పండు ప్రత్తికంటె భారతదేశములో ఎకరమునందు పండు ప్రత్తి చాలా తక్కువగానున్నదని, మంచిఎరువులు వేసి, మేలురకమైన విత్తనములను సత్తి ఉత్పత్తి హెచ్చింపవలసి యున్నదని ఆయన చెప్పెను. సాధ్యమైన తక్కువకాలములో ప్రత్తిలోటును భర్తీచేయుమార్గములను సభవారు ఆలోచింపవలసియున్నదనిరి. ప్రత్తి పంటను హెచ్చించు ఏపథకమైననుసరే భారతప్రభుత్వమువారి అధికఆహారోత్పత్తి కృషికి అడ్డుతగులునట్టిదిగా నుండరాదనిరి.

ఇప్పుడు దేశములో ఎంత ప్రత్తి లభ్యమగుచున్నదో సభవారు వివరముగా పరిశీలించిరి. ప్రత్తి ఉత్పత్తి హెచ్చించుటకుగలమార్గములను విచారించిరి. విదేశములనుండి దిగుమతియగు ప్రత్తిపై భారతదేశము ఆధారపడకుండా చేయుటకు ఎట్టి చర్యలు గైకొనవలెనో దీర్ఘసూత్రపు ప్రత్తిని దేశములో పండించుటకు యెట్టి చర్యలు గైకొనవలెనో సభవారు విచారించిరి. దీర్ఘసూత్రపు ప్రత్తిని యిప్పుడు భారతదేశము యుగాండా ఈజిప్టులనుండి దిగుమతిచేసికొనుచున్నది. భారతదేశమునకు ఈ రకపు ప్రత్తి 6 లక్షల బేళ్లు కావలసియున్నది. ప్రత్తి విషయమున స్వయం సమృద్ధి సాధించుటకు వివిధ రాష్ట్రములలో గైకొనదగిన చర్యలను సభవారు విచారించిరి.

ఈ సభకు హాజరైనవారిలో మద్రాసు వ్యవసాయశాఖమంత్రి శ్రీ ఏ. బి. శెట్టి, హైదరాబాదు మంత్రి శ్రీ కృష్ణారావు గారలు కలరు. భారతప్రభుత్వ ప్రతినిధులుకూడ సభలో పాల్గొనిరి.

## ట్రెయినింగ్ విద్యార్థుల సమ్మె

కర్నూలు, నవంబరు 14: స్థానిక ప్రభుత్వ ట్రెయినింగు స్కూలులో సెకండరీగ్రేడు ట్రెయినింగు కోర్సు చదువుకున్న రెండవ సంవత్సరం విద్యార్థులంతా గత శుక్రవారంనుంచి తరగతులకు వెళ్ళుట మానివేసిరి. వారిలో ఒక విద్యార్థిని సస్పెండుచేయుట, స్టయిపెండులు ఆలస్యముగ పంచిపెట్టుట మొదలయినవి ఇందుకు కారణములని చెప్పుచున్నారు.

హయ్యరుగ్రేడు ట్రెయినింగు రెండవ సంవత్సరం విద్యార్థులు నేడు సమ్మెలో చేరిరి. ఈ రెండు తరగతులలోని విద్యార్థులుమాత్రం తరగతులకు హాజరగుచున్నారు.

ఈ సమ్మె అక్రమమయినదనీ, ఇందులో చేరువారిపై, కటువయిన క్రమశిక్షణ చర్య తీసికొనబడునదనీ, స్కూలునుంచి పంపివేయుటకూడ జరుగునని హెడ్మాస్టరుగారు ప్రకటించిరి. (స్వ. వి.)

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras

## చిత్తూరు జిల్లా అరవల దటీ

### జిల్లా తమిళ మహాసభ తీర్మానం

తిరుత్తని, నవంబరు 12: చిత్తూరు జిల్లా తమిళ మహాసభ నిన్నటిదినము సాయంత్రం 4-30 గంటలకు తిరుత్తని యందలి గాంధి మైదానములో సమావేశమైనది. ఈ సభకు చెన్నపురి వాస్తవ్యులగు శ్రీ యం. పి. శివజ్ఞాన గ్రామణిగారు అధ్యక్షత వహించిరి.

మదరాసు కార్పొరేషన్ మేయరు శ్రీ యస్. రామస్వామి నాయుడుగారు సభను ప్రారంభించిరి. శ్రీ వి. కె. శిరగోపాచార్యులుగారు వచ్చిన సదస్యులకు స్వాగతము చెప్పిరి.

సభాధ్యక్షత వహించిన శ్రీ శివజ్ఞాన గ్రామణిగారు ఉపన్యసించుచు తమిళము-తమిళరాష్ట్ర నిర్మాణములను గూర్చియు, చిత్తూరుజిల్లాలో మదనపల్లి, వాయల్పాడు తాలూకాలు రెండు తప్ప మిగత భాగము లన్నియు తమిళ రాష్ట్రమున చేర్చవలసిన అవసరమునుగూర్చి చెప్పిరి. సుబ్రహ్మణ్య స్వామి, వడవేంగడము గోవిందుడు (తిరుపతిస్వామి) తమిళుల దేవుళ్ళని చెప్పుచు, ఆంధ్రులను, ఆంధ్రభాషను, ఆంధ్రులకట్టుబొట్టులను, ఆహారపానీయాదులను, రుచులను తీవ్రముగా విమర్శించుచు మాట్లాడిరి. శ్రీ అటువెనుక యస్. రంగనాథ మొదలి, కె. శివనాయకం, పులియామంగలం స్వామియార్ మున్నగువారు ప్రసంగించిరి. చిత్తూరు జిల్లా తమిళులదేయని మాటలాడిరి. అటు తరువాత చిత్తూరుజిల్లాను తమిళ రాష్ట్రమున చేర్చవలయుననెడి తీర్మానముతో నింకను అనేక విషయములమీద తీర్మానములు గావించిరి.

## ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనేట్ సభ్యత్వం

### కృష్ణాజిల్లా స్థానికసంస్థల తరపు అభ్యర్థిత్వం

గుడివాడ, నవంబరు 12: ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనేటులో కృష్ణాజిల్లాలోని స్థానికసంస్థలకు గల స్థానానికి రాష్ట్ర కాంగ్రెసువారు జాలాది ఇమాన్యుయల్ గారిని అభ్యర్థిగా నియమించారు. ఇందువల్ల ఈ స్థానానికి దరఖాస్తులు పెట్టిన డాక్టరు టి. వి. ఎస్. చలపతిరావు, ముదునూరు సుబ్రాజు, జంధ్యాల దక్షిణామూర్తిగార్లు ఉపసంహరించుకొన్నట్లు తెలిసినది.

స్వ వి.

## ఆంధ్రా అమెచూర్ వెయిట్ లిఫ్టింగు పోటీలు

గుడివాడ, నవంబరు 15: ఆంధ్రా అమెచూర్ వెయిట్ లిఫ్టింగ్ పోటీలు డిశంబరు ఆఖరివారములోగాని, వచ్చే జనవరి మొదటివారములోగాని గౌ॥ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను గుంటూరులో జరుగును. లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షుడు ఆర్. బి. రామకృష్ణరాజుగారు ప్రారంభోత్సవము, ఈయ్యాచు కుమారరాజాగారు పతాకోత్సవము చేయుదురు. ఈ పోటీలలో ఆంధ్రావనిలోని యువకులందరు పాల్గొనవలెనని, వీటిలో గెలుపొందిన వారిని వచ్చే ఫిబ్రవరి 9, 10 తేదీలలో బొంబాయిలో జరుగు భారత ఒలింపిక్ పోటీలకు పంపించవలయునని, పూర్తి వివరములకు తమ సేర వానపాములపోస్టు (కృష్ణాజిల్లా) వ్రాయవలెనని దండమూడి రాజగోపాలరావుగారు కోరుచున్నారు.

## సభలు - సమావేశాలు

గుంటూరుజిల్లా కాంగ్రెసుసంఘ సర్వసభ్య సమావేశము నవంబరు 24 మ. 2 గం. కు తెనాలి వెంకటేశ్వర టాకీసులో జరుగును.

### ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ

అనంతపురం, నవంబరు 13: ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ ఈనెల 19, 20 తేదీలలో శబాల దశరథరామరెడ్డిగారి అధ్యక్షతను ఇక్కడ జరుగును. కృష్ణాజిల్లా కో-ఆపరేటివు సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు రావుబహద్దరు కొల్లిపర జంకటరమణయ్య నాయుడుగారు సభను ప్రారంభించెదరు. సహకార సంఘముల జాయింటు రిజిష్ట్రారు కె. సుబ్రహ్మణ్యం నాయుడుగారు పతాకోత్సవము చేయుదురు.

## జావాలో గోరిల్లాదళాల చర్యలు

బటేవియా, నవంబరు 12: పూర్వ పశ్చిమ జావాలలో గడచిన 48 గంటలలో గోరిల్లాలు ఒక రైల్వేలైనుకింద మందుగని మాటుపెట్టి ఒక సుబ్బంది పడగొట్టినారు, 7 గుర్ని హతమార్చి 6 పర్ని గాయపరచినారు చేశారు: ఒక ఇం... నీషియన్ రెడ్ క్రాస్ వాహనానికి తెగువాటు వేసి 4 ఖరు నర్సులను అపహరించుకొని పోయినారు. పశ్చిమజావాలో వచ్చిసైన్యాలు రిపబ్లికన్ సైన్యాలు కలిసి దారుల్ ఇస్లామ్ గొరిల్లాలను వేటాడుతున్నవి.

## నానారుచిరార్థ సూక్తినిధి నన్నయ

### జయంతి సభలో విశ్వనాథ సత్యనారాయణగారి ఉపన్యాసం

### కవిసమ్రాట్కు సత్కారం

రాజమహేంద్రవరం, నవంబరు 13:- నన్నయ జయంతి సందర్భంలో కళాభివర్ధనీ పరిషత్తువారు నిన్న కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిని నూతన వస్త్రములతోను, నూటపదహార్లతోను సత్కరించి వారిచే "నానారుచి రార్థ సూక్తినిధి నన్నయ" అను విషయమై ప్రత్యేకోపన్యాసమిప్పించిరి. సాయంత్రం విశ్వనాథ సత్యనారాయణగారిని, వారికి నూటపదహార్లిచ్చిన ఉపాయన దాత ముక్కవల్లి సూర్యనారాయణగారిని ఆహ్వాన సంఘంవారు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారింటినుంచి కారులో ఊరేగించుచూ సభాస్థలియైన తిరుపతిరాయ కాంగ్రెస్ భవనమునకు తరలించుకొని వచ్చిరి. ఈ ఊరేగింపులో పైడిస్వామిగారు సన్నాయి వాద్యము చేసిరి.

సభలో కళాభివర్ధనీ పరిషత్తు అధ్యక్షుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు విశ్వనాథవారిని సభికులకు పరిచయం చేయుచూ నన్నయను పూర్తిగా అవగాహనము చేసికొన్న ఆంధ్ర మహాకవులలో విశ్వనాథ సత్యనారాయణగారు మొదటివారనీ అటువంటివారు యీ నన్నయ జయంతిసందర్భంలో నన్నయను గురించి యిచ్చట ప్రసంగించడం చాల ఆనందించవలసిన విషయమనీ వివరించిరి. ముక్కవల్లి సూర్యనారాయణగారు సత్యనారాయణగారికి నూటపదహార్లు సమర్పించినతర్వాత భమిడిపాటి కామేశ్వరరావుగారు నూతనవస్త్రములు సమర్పించిరి. ఈ నూతన వస్త్రముల ద్రవ్యమును జయంతి నిర్వాహకులు ప్రజలవద్ద నుండి వసూలుచేసిరి. సన్మాన కార్యక్రమము ముగిసినపిమ్మట విశ్వనాథ సత్యనారాయణగారు 'నానారుచిరార్థ సూక్తినిధి నన్నయ' అను విషయమును అనేక ఉదాహరణలతో రుజువుచేయుచూ ప్రసంగించిరి. ఎంత విమర్శనాత్మకమైన దృష్టితో పరిశీలించిచూచినా నన్నయ రచనలో నానా రుచిరార్థములు, సూక్తులు కన్పించుననీ, యితర కవులకన్న ఆయనలోని విశిష్టత అదేనని చెప్పి వాల్మీకి, నన్నయలను విడిచినచో యిక కవులే లేరని చెప్పవచ్చుననిరి. భారతం రచనకుగల కారణములనుగురించి మాట్లాడుచూ కర్మసిద్ధాంతము అంటే కార్యకారణభావమనీ, అట్టి కర్మసిద్ధాంత ప్రతిపాదనకొఱకే భారతం వ్రాయటం జరిగిందనీ సత్యనారాయణగారనిరి. ఎచ్చట, ఏఘట్టం ఏవిధంగా వర్ణించాలో ఆ విధంగా నన్నయ భారతంలోని ప్రతిఘట్టమును వర్ణించెననీ, ఆయన వర్ణించిన ప్రతివర్ణనలోను ఎంతో అర్థం యిమిడియున్నదనీ ప్రతివారూ తప్పక భారతం చదివి అందులోని నన్నయ సారామృతాన్ని ఆస్వాదించాలనీ సత్యనారాయణగారు హెచ్చరించిరి.

భమిడిపాటి కామేశ్వరరావుగారు కార్యక్రమమును సమీక్షించుచూ ప్రసంగించినపిమ్మట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వందనములతో సభ ముగిసెను.

### రామాయణ కల్పవృక్ష పఠనం

విశ్వనాథ సత్యనారాయణగారు నేడుదయం ఒక గంటసేపు యిచ్చటి ట్రయినింగ్ కాలేజీ ఆవరణలో తమ రామాయణ కల్పవృక్షములోని కొన్ని ఘట్టములను శ్రావ్యముగ పఠించిరి. చంద్రశేఖరశర్మ అను కాలేజీ విద్యార్థి సత్యనారాయణగారిపై ప్రశంసా పద్యములు చదివెను. ఈ కార్యక్రమమునకు కాలేజీ ప్రిన్సిపాల్ కేశిరాజు సత్యనారాయణగారు అధ్యక్షత వహించిరి. (స్వ. వి)

## యిల్లెందుతాలూకా కాంగ్రెస్ ప్రతినిధుల ఎన్నికలు

కొత్తగూడెం, నవంబరు 12 యిల్లెందు తాలూకా కాంగ్రెసు ప్రతినిధుల ఎన్నికలలో శివిపురం ఫిర్కాకు చారుకుండ్ల రంగారావు, సుడిబంఎలత్తి ... కాంతారావు, మోదుకూరి వెంకటనారాయణగారున్నా, కొత్తగూడెం ... పొమ్మకంటి నరసింహామూర్తిగారు, ముచ్చర్లలో కె. యల్. నరసింహారావుగారు పోటీలేకుండా ఎన్నిక అయిరి. యిల్లెందు ఫిర్కాలో యుక్. వి. యల్ నరసింహారావుగారు గెల్చిరి. కారేపల్లి ఫిర్కాలో పర్చూరుగ్గా ప్రసాదరావు, నేగునూరి జగన్నాథరావు గార్లు నెగ్గిరి.

## ఏటుకూరి వెంకట నరసయ్యగారి మృతి

### జన్మస్థానములో సానుభూతి సభ

నిడుబ్రోలు, నవంబరు 12: 'కవిబ్రహ్మ' యేటుకూరి వెంకటనరసయ్యగారు, 10 వ తేదీరాత్రి సుమారు 11 గంటలకు, స్వర్గస్థులయిరి. 15 రోజులనుంచి వ్యాధిగ్రస్థులై ఇచ్చటనే యుండిరి. భార్య, యిద్దరు కుమారులు, యిద్దరు కుమార్తెలు గలరు. స్వర్గీయుని గౌరవార్థం, నిన్న స్థానిక హైస్కూలు మూసివేసిరి.

### పెదకూరపాడులో స్మారకసభ

ఈ గ్రామములో 13-న కవిబ్రహ్మ ఏటుకూరి వెంకటనరసయ్యగారి అకాల మరణమునకు సానుభూతి సూచకముగ సభ జరిగెను. బి. నరసింహామూర్తిగారధ్యక్షత వహించిరి. దర్శి లక్ష్మయ్య, కె. రాజయ్య, యన్. బాలయ్య, హుస్సేన్ మొదలగువారు పెదకూరపాడులో జన్మించిన రత్నమనదగిన వెంకటనరసయ్యగారి మరణమునకు తమ విచారమును వెలిబుచ్చిరి. నరసయ్యగారి అకాలమరణమునకు చింతిల్లుచు, వారి యాత్మకు శాంతిని గోరుచు, వారి కుటుంబమునకు సానుభూతిని దెలుపుచు తీర్మానించిరి.

* * *

కొల్లూరు: శ్రీ జనస్వామి కోదండరామశాస్త్రిగారిట్లు వ్రాసిరి.

వెంకటనరసయ్యగారి అకాలమరణ వార్త నన్ను దుఃఖాబ్ధిలో ముంచినది. నరసయ్యగారు ఆంధ్రకవితా సరస్వతికి ఒక నవాభరణం. వారి మరణములో తెలుగు సాహితి ఒక అనుంగు పుత్రుని కోల్పోయినది. ప్రాచీన పల్నాటివీరుల శౌర్యప్రతాపములను ఆయా స్థల మహత్మ్యములను ఆనాటి మగువల ధైర్యోత్సాహములను కవితాశక్తితో రసతరంగా గానం సల్పిన కవిబ్రహ్మను ఆంధ్రులు మరువలేరు. నిద్రాణమైయున్న ఆంధ్రజాతిని మేల్కొల్పెడివారి 'మగువ మాంచాల', 'క్షేత్రలక్ష్మి' మొదలగు సత్కావ్యములు తెలుగుజాతి సజీవమై యున్నంతవరకు ఆదరణ పొందుచునే యుండును. యువకవులకు, ప్రారంభించుచున్నవారికి వారివద్ద మంచి ప్రోత్సాహము లభించుచుండెడిది. వారు ఉత్తమశ్రేణికి చెందిన ఉపాధ్యాయులు. వారి ఆత్మకు భగవంతుడు శాంతి నొసగుగాక! వారి కుటుంబమునకు నా సానుభూతి.

## మేకను రక్షించబోయిన బాలుని మరణం

బెజ్జన్నూరు, నవంబరు 8:

మొన్న సిక్కాడ రైల్వే పట్టా అవద్ధ మేయుచున్న మేకను రక్షింపబోయిన, కాపరి కుర్రవాడు (12) ప్యాసెంజరు రైలుక్రిందపడి, దుర్మరణము పొందినాడు.

ప్రమాదవశాత్తు రైలుక్రింద పడుటవలన మరణం సంభవించినట్లు, శవ పంచాయితీలో పేర్కొన్నారు.

## మహిళల బాధ్యత

### గోవిందవల్లభపంత్ ఉద్బోధ

అలహాబాదు, నవంబరు 13: సం॥ రా॥ ప్రధాని పండిత గోవింద వల్లభపంత్ గారు ప్రయాగ మహిళా విద్యాపీఠ పట్టప్రదానోపన్యాసము గావించుచు స్వాతంత్ర్యోద్యమములో భారత మహిళామణుల పాత్రను ప్రశంసించిరి. ఇకముందు స్త్రీలు భారత జాతీయజీవనములో గొప్ప పాత్ర వహించుట దైవనిర్దిష్టమని ఆయన చెప్పుచు వారు భారతదేశమును భూతల స్వర్గము చేయవచ్చుననిరి.

ఇతర దేశములలోకంటె భారతదేశములో స్త్రీ విద్య చాలా వెనుకబడియున్నదని శ్రీ పంత్ గారు చెప్పుచు స్త్రీవిద్యకై ఎక్కువ సంస్థలను స్థాపించుటకు సాధ్యమైనదంతయు చేయవలెననిరి. మహిళా విశ్వవిద్యాలయ స్థాపన విషయమై విచారించుటకు ప్రభుత్వమువారు ఒకసంఘము నేర్పరచిరని ఈ సందర్భమున పంత్ గారనిరి.

భారతదేశములో స్త్రీ విద్యావిధానమును సంపూర్ణముగా మార్చివేయవలెనని, స్త్రీలకు గణితము భూగోళము మున్నగు విషయములతోపాటు గృహనిర్వాహణ శాస్త్రము, సంగీతము మున్నగు లలిత కళలు బోధింపవలెనని, ఇప్పుడు దేశమునకు యెక్కువమంది వైద్యులవసరమని పంత్ గారనిరి.

కొంత కాలము క్రిందట భారత మహిళలు బయటికివచ్చి సాంఘిక ఆర్థిక కార్యకలాపములలో పాల్గొనక అయిష్టత జూపుచుండిరని పంత్ గారు చెప్పుచు స్వాతంత్ర్యోద్యమ సమయమున గాంధి మహాత్ముడు గొప్ప మార్పు తెచ్చెనని, స్వాతంత్ర్యోద్యమములో స్త్రీలు అగ్రేసరులై ఓర్పుతోను, ధైర్యముతోను ప్రవర్తించి, సీతా, ఝాన్సీ లక్ష్మీబాయి మున్నగు వీరవనితలు ప్రదర్శించిన సుగుణములన్నిటిని ప్రదర్శించిరని చెప్పిరి. నూతన రాజ్యాంగ విధానమును పురించి రాజకీయములలో స్త్రీలకు పురుషులకు సెట్టి స్థానము నంపెదనిరి.